# మతము-పథము





రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు







# మతము-పథము

రచయిత

త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (88) దశ అష్టాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు




ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-38 నాల్గవ ముద్రణ : మార్చి-2017

ప్రతులు : 1000 **వెల : 45 /-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ.
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము.
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన.
77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు).
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) మానవత్వము.
90) సుప్రసిద్ధి బోధ.
91) రూపము మారిన గీత.
92) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
93) యోహాను చెప్పిన జ్ఞానము.
94) రాజకీయము×రాజకీయము.
95) ఉగ్రవాదము స్వర్గము కొరకే.
96) ఒక వ్యక్తిలో రెండు కోణములు.
97) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
98) మధ్యమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు.

**భాషలో పాండిత్యమును విడిచి,**

**భావములో పాండిత్యమును చూచువాడు నిజమైన జ్ఞాని.**

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?

79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.



# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్‌స్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘుడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హాస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# మతము - పథము

భూమండలములో దేవున్ని విశ్వసించిన మనుషులను మూడు భాగములుగ విభజించవచ్చును. అలాగే దేవున్ని విశ్వసించిన మతములను కూడా మూడుగానే చెప్పుకోవచ్చును. ఆ మూడు మతములలో ప్రాచీన మైనది, అన్నిటికంటే ముందు పుట్టినది హిందూమతము, తర్వాత పుట్టినది క్రైస్తవ మతము, ఆ తర్వాత పుట్టినది ఇస్లామ్ మతము. ముఖ్యమైన ఈ మూడు మతములలో దేవున్ని గురించి విపులముగా, చాలా దగ్గరగా బోధించినది హిందూమతములోని బోధయేనని చెప్పవచ్చును. తర్వాత బోధలో రెండవ స్థానములో ఉన్నది క్రైస్తవ మతము. అలాగే బోధలో మూడవ స్థానమును పొందినది ఇస్లామ్ మతము.

బోధలలో మూడవ స్థానములో ఇస్లామ్ ఉన్నప్పటికీ, దేవుని మార్గములో మొదటిది, దేవున్ని పూర్తి విశ్వసించినది, దేవునికి చాలా దగ్గరగా యున్నది ఇస్లామ్ మతమేనని చెప్పవచ్చును. అలాగే విశ్వాసములోగానీ, సామీప్యములోగానీ రెండవ స్థానములో ఉన్నది క్రైస్తవ మతము. చివరిగా మూడవ స్థానములో ఉన్నది హిందూ మతమని చెప్పవచ్చును. ఒక లెక్కప్రకారము చెప్పుకొంటే ఇస్లామ్ మతములో దేవుని మీద విశ్వాసము 90 శాతము ఉండగా, క్రైస్తవ మతములో 50 శాతము గలదు. చివరిలో నున్న హిందూ మతములో కేవలము 2 శాతముగానీ దానికంటే తక్కువగానీ కలదని చెప్పవచ్చును. ఇక్కడ ఇపుడు మీకొక ప్రశ్నవచ్చి నన్నడుగవచ్చును. ప్రశ్న ఏమనగా! ఇస్లామ్ మరియు క్రైస్తవులకంటే పూజలు చేయు వారూ, గుడులకు పోవువారూ, యజ్ఞములు చేయువారూ, బోధలు చెప్పు స్వామీజీలూ, మహత్యములు చూపు బాబాలు ఎందరో ఉండగా హిందూ మతములో ఎంతో హీనముగా కేవలము 2 శాతమే విశ్వాసముంది అంటున్నారేమిటి? అని ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా!

మేము చెప్పునది దేవుళ్ళకు కూడా దేవుడైన దేవుని మీద విశ్వాసమును గురించి చెప్పాము. మీరు అడుగునది దేవుడు పుట్టించిన దేవతల భక్తిని గురించి. దేవతల భక్తి హిందూ మతములో ఉన్నంతగా ఏ మతములో లేదు. దేవతాభక్తి 99 శాతము హిందువులలోనే కలదని చెప్పవచ్చును. కానీ దేవుని మీద భక్తి కేవలము 2 శాతము కూడా లేదని చెప్పుచున్నాము. మిగతా రెండు మతములలో దేవుని మీద భక్తి తప్ప దేవతల మీద భక్తి లేదనియే చెప్పవచ్చును. దేవుని గురించిన బోధలుగల తలమాణిక్యమైన గ్రంథములు మూడు మతములలో మూడు గలవు. అవి ఇస్లామ్ మతములో పవిత్ర ఖురాన్, క్రైస్తవమతములో పరిశుద్ధ బైబిలు, హిందూమతములో భగవద్గీత గలదు. ఇక్కడ గమనించదగిన విషయమేమంటే ఇస్లామ్ మతగ్రంథమైన ఖురాన్ ముందర 'పవిత్ర' అను బిరుదు గలదు. అలాగే క్రైస్తవములోని బైబిలు ముందర 'పరిశుద్ధ' అను బిరుదు గలదు. అయితే ఒక్క హిందూ మతములోని భగవద్గీత ముందర ఏ బిరుదు లేదు. వెనుక పుట్టిన బోధలకు పవిత్ర అని, పరిశుద్ధ అని బిరుదులు ఉండగా ముందు పుట్టిన భగవద్గీతకు మొదట బిరుదులేదా? అని యోచిస్తే, గడచిన కాలములోనికి పోయిచూస్తే భగవద్గీతకు ముందు దాని విలువను తెలుపు బిరుదులుండెడివని తెలియుచున్నది. అంతే కాదు ఇంకా వెనక్కి వెళ్ళిచూస్తే నేడు మనకు తెలియని ఎన్నో సత్యములైన రహస్యములు బయటపడుచున్నవి.

ఇప్పుడు ప్రచారములోనున్న భగవద్గీత భగవంతుడైన శ్రీకృష్ణుని చేత అర్జునునికి ద్వాపరయుగములో (ద్వాపరయోగములో) చెప్పబడి నప్పటికీ, దానిని పూర్వమే సృష్ఠి ఆదిలోనే పరమాత్మ సూర్యునికి చెప్పి యున్నాడు. దీనినిబట్టి భగవద్గీత సృష్ఠి ఆదిలోనే ఉన్నదని తెలియుచున్నది. సృష్ట్యాది నుండి ఉన్న భగవద్గీతలో నేడు క్రైస్తవ మతములోను, ఇస్లామ్

మతములోను చెప్పిన సారాంశము గలదు. అందువలన గీతకు పవిత్ర, పరిశుద్ధ అను రెండు బిరుదులు గలవు. భగవద్గీత భూమిమీదనున్న ఏ మతము పేరుతోను చెప్పబడియుండలేదు మరియు దైవసంబంధమైన పరమును గురించి మాత్రమే బోధించినది. కావున దానికి 'పరమ' అని బిరుదు మొదటనే కలదు. భగవద్గీత పరమును (దైవమును) చూపునది, జ్ఞానపవిత్రతను కలిగియున్నది మరియు కర్మయను మురికిని తొలగించునదై యున్నది. అందువలన గీతను **పరమ పవిత్ర పరిశుద్ధ** గ్రంథమని ద్వాపరయుగముకంటే ముందే కృతయుగములోనే అనెడివారు. భూమిమీద ఆ కాలములో అందరు జ్ఞానము తెలిసిన వారుండెడివారు. మాయ ప్రభావము చేత కొంత కాలమునకు మనుషులు దైవజ్ఞానమునకు దూరమైపోతూ వచ్చారు. ఆ విధముగా మనుషులు అజ్ఞానమువైపు పోతూ పోతూ భగవద్గీతకు గల బిరుదులను మరిచిపోయారు. అంతేకాక చివరకు భగవద్గీతనే మరచిపోయారు. గీతలోని ధర్మములను పూర్తి మరచిపోయారు. ద్వాపర యోగము (యుగము) చివరలో ధర్మములకు పూర్తి గ్లాని ఏర్పడినది. అటువంటి సందర్భములో దేవుడు మనిషిగా పుట్టి శ్రీకృష్ణునిగా ప్రవర్తించి సమయమును చూచి గీతను తిరిగి చెప్పిపోయాడు. ద్వాపరయోగము చివరిలో చెప్పబడిన భగవద్గీత కలియోగము మొదటికాలమైన ప్రస్తుత కాలములో ఉన్నప్పటికీ దానికి బిరుదులు ఏమాత్రము లేకుండా పోయాయి. వెనక కలియోగములో పుట్టిన బైబిలుకు పరిశుద్ధ గ్రంథమనీ, దానికంటే ఎంతో వెనుక పుట్టిన ఖురాన్‌ను పవిత్రగ్రంథమని పిలుస్తున్నపుడు, ఎంతో ముందు పుట్టిన భగవద్గీతను ఏ బిరుదుతో పిలువకపోవడము వలన గీతలోని జ్ఞానమునే చిన్నబుచ్చినట్లవుతుంది. బైబిలు, ఖురాన్ గ్రంథములకంటే ముందు చెప్పబడిన గీతజ్ఞానము అన్ని రకముల పవిత్రమైనది, పరిశుద్ధ మైనది. దీనికి నిదర్శనముగా గీతలోనే జ్ఞానయోగమను అధ్యాయములో

38వ శ్లోకములో **"నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే"** అని చెప్పియున్నారు. దాని అర్థమును క్లుప్తముగా చెప్పుకొంటే గీతలో చెప్పిన జ్ఞానమునకు సమానమైనదిగానీ, దానికంటే పవిత్రమైనదికానీ లేదని తెలియుచున్నది. ఇదే జ్ఞానము ఇతర మతగ్రంథములలో ఉన్నది. ఇదే జ్ఞానము కొంత శాతమున్న గ్రంథములకు పవిత్ర అనీ, పరిశుద్ధ అనీ బిరుదులు పెట్టినపుడు, పూర్తి శాతము జ్ఞానమున్న భగవద్గీతను చెప్పునపుడు దాని గొప్పతనమును సూచించకుండా, ఏ బిరుదులు లేకుండా పిలువడము భావ్యము కాదు. కనుక మనము ఇప్పటినుండి భగవద్గీతను నిజమైన భావముతో **పరమ, పవిత్ర, పరిశుద్ధ భగవద్గీత** అని పిలుస్తాము. ఇదే విషయాన్ని అందరికీ తెలిపి అందరిచేత భగవద్గీతను పరమ పవిత్ర పరిశుద్ధ అను బిరుదులతోనే గౌరవిస్తాము.

పరమ పవిత్ర పరిశుద్ధ గ్రంథమైన భగవద్గీత కేవలము దేవుని జ్ఞానాన్ని మాత్రము తెలుపుచున్నది. గీత ఏ ఒక్క మతమునకు సంబంధించినది కాదు. ఇపుడు మనుషుల మధ్యలోనున్న అన్ని మతముల సారాంశము భగవద్గీతలో కలదు. గీత సమస్త మానవులకు దైవసందేశముగా ఉన్నది. గీతలో చెప్పిన జ్ఞానము ఇటు బైబిలులోనూ, అటు ఖురాన్‌లోనూ కనిపిస్తున్నది. దేవుని చేత రెండుమార్లు చెప్పబడినది భగవద్గీత ఒక్కటి మాత్రమే. భగవద్గీతలో ఎంత వెదకినా జ్ఞానమే కనిపిస్తుంది. కానీ మతము ఏమాత్రము కనిపించదు. అందువలన గీతను మతాలకు అతీతమైనదని చెప్పవచ్చును. ముఖ్యముగా చెప్పుకుంటే సృష్ఠి ఆదిలో సూర్యుడు భగవద్గీతను విన్నపుడు భూమిమీద మతము పేరే లేకుండెడిది. తర్వాత కొంత కాలమునకు మాయ యొక్క ప్రభావముచేత మతము అనునది మానవుల మధ్యలోనికి వచ్చి చేరిపోయినది. దేవుని జ్ఞానమునకు వ్యతిరేఖముగా

మాయ తన జ్ఞానమును దేవుని జ్ఞానమువలె ప్రచారము చేసి ఏది దేవుని జ్ఞానమో, ఏది మాయ జ్ఞానమో అర్థము కాకుండా చేయును. అలాంటి పరిస్థితులలో దైవజ్ఞానము మీద ఆసక్తి కలవారందరు దేవుని జ్ఞానము మాదిరియున్న మాయ జ్ఞానమును దైవజ్ఞానముగా లెక్కించి దానినే తెలుసుకొను అవకాశము గలదు. మానవులను దేవుని వైపు పోకుండా చేయుటకు, తనవైపుకు వచ్చుటకు మాయ ఎంతోమంది స్వామీజీల చేత తన జ్ఞానమును చెప్పించుచున్నది. మాయ తనయొక్క జ్ఞానమును ప్రచారము చేయువారికి పెద్ద పెద్ద బిరుదులను అంటకట్టి వారినే ప్రజలు నమ్మునట్లు చేయుచున్నది. దేవుడు తన జ్ఞానమును తెలుపుటకు కొన్ని వేల సంవత్సరములకు ఒకమారు భూమి మీదకు భగవంతుని రూపములో వచ్చుచున్నాడు. భగవంతుడు ఒక్కడే భూమిమీద జ్ఞానమును చెప్పితే మనుషులు దానినే వినే అవకాశముండుట వలన అట్లుకాకుండా మాయ భూమిమీద తన జ్ఞానమును చెప్పు మనుషులకు అనేకమందికి 'భగవాన్' అని వారి పేరు చివర అంటించినది. అందువలన భూమిమీద ఎల్లకాలము ఎందరో భగవాన్‌లు తమ తమ మాయబోధలను చెప్పుచునే ఉందురు. ఎల్లపుడు 'భగవాన్' అనుపేరు కలవారు భూమిమీద ఉండగా వేల సంవత్సరములకు ఒకమారు వచ్చు భగవంతున్ని ఎవరూ గుర్తించలేరు, అంతేకాక ఆయన జ్ఞానమును కూడా ప్రత్యేకముగా గుర్తించలేరు. అందువలన భూమిమీద ప్రస్తుతమున్న జ్ఞానములలో, ఏది నిజమైన దైవజ్ఞానమో గుర్తించలేని పరిస్థితులలో మానవులున్నారు. ఈ విధముగా మాయ తన జ్ఞాన విధానమును మనుషుల మధ్యలో ఎందరో మనుషులనే గురువులుగా చలామణి చేస్తూ వారిద్వారా ప్రచారము చేయిస్తున్నది.

మాయ తన జ్ఞానము మానవుల మధ్యలోనికి పంపి దేవుని జ్ఞానమును మరిచిపోవునట్లు చేయుటకు మొట్టమొదటి ఆయుధముగా

మతము అను దానిని ప్రవేశపెట్టినది. మాయ మొదట మతమును ఏ విధముగా, ఎంత చాకచక్యముగా భూమిమీద ప్రవేశపెట్టినదో వివరించు కొని చూస్తాము. దేవుడు సృష్ఠి ఆదిలోనే తన జ్ఞానమును సూర్యుని ద్వారా మనుషుల మధ్యలోనికి ప్రవేశపెట్టాడు. ఏ మనిషి అయినా లేక ఏ జీవుడైనా **'మోక్షము'** అను గమ్యమును చేరుటకు నేను చెప్పిన మార్గము తప్ప వేరు మార్గము లేదని తెలియజేశాడు. గమ్యమున్నదంటే దానికొక మార్గముండాలి కదా! దేవున్ని చేరుటకు, లేక మోక్షమును చేరుటకు దేవుని చేత నిర్ణయింప బడిన మార్గమే జ్ఞానమార్గము అని అంటాము. జ్ఞానమార్గమును జ్ఞానపథము అనికూడా అంటాము. పథము అనగా మార్గమనియే అర్థము. పూర్వము జ్ఞానపథము అనే మాటనే ప్రజలు ఎక్కువగా అనుకొనెడివారు. ఎవడైతే దైవజ్ఞానమును సాధించుచున్నాడో వానిని జ్ఞానపథములో ఉన్నాడని ఇతరులు చెప్పెడివారు. ఇతర మత గ్రంథములలో కూడా జ్ఞానమార్గము చాలా ఇరుకైనదనీ, మాయమార్గము చాలా విశాలమైనదని కూడా చెప్పారు. గీతలో కూడా రాజవిద్యా రాజగుహ్య యోగమను అధ్యాయములో 23వ శ్లోకమున "ఇతర దేవతలను పూజించువారు దారితప్పి నడచిన వారగుదురని" కూడా చెప్పాడు. దేవుడు జీవునికి గమ్యమైనపుడు ఆ గమ్యమును చేరుటకు తప్పునిసరిగ మార్గము కావాలి. ఆ మార్గమునే 'జ్ఞానపథము' అని అనెడివారు. జ్ఞానము అను పథమును గురించి చెప్పుకొంటే జ్ఞానము రెండు రకములుగా ఉన్నది. ఒకటి దేవుని జ్ఞానము, రెండవది ప్రపంచజ్ఞానము కలవు. మార్గము లేక పథము అనునవి ఒకే అర్థము నిచ్చినప్పటికీ జ్ఞానము రెండు రకములుగా ఉన్నది కావున దైవ జ్ఞానమును, ప్రపంచజ్ఞానమును వేరువేరుగా గుర్తించుటకు దైవజ్ఞానమునకు **"ఇందు"** అను పదమును వాడెడివారు. ఇందు అనగా చంద్రుడని అర్థము. జ్యోతిష్యశాస్త్రము ప్రకారము చంద్రగ్రహము దైవజ్ఞానమునకు అధిపతి,

గురుగ్రహము ప్రపంచ జ్ఞానమునకు అధిపతి. కావున ఇక్కడ దైవజ్ఞానమును ప్రత్యేకముగా గుర్తించుటకు దైవజ్ఞానమునకు అధిపతియైన చంద్రుని పేరును జ్ఞానము ముందర పెట్టారు. చంద్రున్ని ఇందు అనెడివారన్నాము కదా! జ్ఞానపథము (జ్ఞానమార్గము) లోనున్న వారిని ఇందూపథములో ఉన్నారని చెప్పెడివారు. పూర్వము ఇందూపథము అను మాటయే వాడుకలో ఉండెడిది. ఆనాటి దైవ జ్ఞానులందరిని కలిపి ఇందూపథములోని వారని అనెడివారు.

దేవుని చేతనే సృష్ఠింపబడి, దేవుని చేతనే శక్తిని పొంది, దేవుని ఆజ్ఞ ప్రకారము నడుచుకొను మాయకు ఇక్కడే పెద్ద ఆయుధము దొరికినది. పథము అనుమాటను మతము అనుమాటగా మార్చివేసినది. మనుషుల తలలలో తిష్టవేసిన మాయ మనుషులచేత పథమును మతముగా పలికించను మొదలుపెట్టినది. ఈ విధముగా మొదట తయారైన మతము అందరిలో వ్యాపించిపోయి ఆనాడు ఇందూపథములోని వారందరిని ఇందూమతములోని వారిగా చెప్పుకొన్నట్లు చేసినది. ఆనాడు భారత దేశమంతా దైవజ్ఞానులే ఉండెడివారు, కనుక భారతదేశమునకు ఇందూ దేశమని పేరు వచ్చినది. అప్పటికాలములో ఇందూదేశములోని వారంతా ఇందూమతము వారేనని చెప్పుకొనెడివారు. అప్పటినుండి ఇప్పటివరకు ప్రపంచములో మొదటి ఇందూదేశముకానీ చివరి ఇందూదేశముగాని భారతదేశమేనని చెప్పవచ్చును. మాయకు కూడా ఇందూదేశము మీదనే ఎక్కువగా కన్ను కలదు. కావున మొదట ఇందూదేశములోనే మతము అనే ఆయుధమును ప్రయోగించినది. ఆ ఆయుధము బ్రహ్మాస్త్రమువలె పనిచేసి ఎంతటి దైవజ్ఞాని చేతనైనా మతము పేరునే చెప్పించుచున్నది. ఎంతో చాకచక్యముగా పథమును మతముగా మార్చిన మాయ అంతటితో ఆగక మరియొక ఆయుధమును కూడా ప్రయోగించినది. అది ఏమనగా!

ఇందు అనగా చంద్రుడనీ, చంద్రుడనగానే దైవజ్ఞానమని తెలిసి పోతుందని, అలా దైవజ్ఞానము పేరు మతము అను పేరుకు ముందుంటే ఎప్పటికైనా మతమును పథముగా ఎవరైనా మార్చినా ఇందూపథము అని తిరిగి మొదటి పేరే వస్తుంది కదా యని యోచించిన మాయ మతము ముందర ఇందూ అను పదమును తీసివేయాలనుకొన్నది. పథమును సులభముగా మతముగా మార్చిన మాయ, ఇందు అను పదము సులభము గానే హిందు అను పదముగా మార్చివేసినది. దానితో ఇందూపథము పూర్తి హిందూమతముగా మారిపోయినది. ఇందూ అనునది హిందూగా, పథము అనునది మతముగా మారిపోవడము వలన అందరూ హిందూ మతమనే అనుకొంటున్నారు. ఇందూపథము నుండి హిందూ మతము లోనికి మనుషులను మార్చిన మాయ, మనుషులలో దైవజ్ఞానమును లేకుండా చేసి తన జ్ఞానమును దైవజ్ఞానమువలె తలచునట్లు చేసినది. అందువలన నేడు ప్రజలలో భక్తి జ్ఞానము ఉంది అంటే అది ఎక్కువ శాతము మాయకు సంబంధించినదే అయి ఉంటుంది. హిందూమతము 98 శాతము మాయజ్ఞానములో కూరుకపోయినదని చెప్పవచ్చును. కొన్ని ఇతర మతములలో కొంతమేరకు అసలైన దైవజ్ఞానముండినప్పటికీ మాయ అక్కడ వారిని కూడా తనవైపు తిప్పుకొనుటకు చూస్తున్నది. అయినప్పటికీ హిందూమతముకంటే ఇతర మతములే కొంత సక్రమ మార్గములో ఉన్నవని చెప్పుకొనవచ్చును. ఎందుకనగా ప్రస్తుత హిందూమతము దేవుని విషయములో చాలా దిగజారిపోయినదని చెప్పుటకు ఎన్నో తార్కాణములు గలవు.

ముఖ్యముగ ఉన్న హిందు, ఇస్లామ్, క్రైస్తవ అను మూడు పథములు వాటివాటి పేర్లతోకాక మతముల పేర్లతోనే కలవు. మూడు మతములలోను అసలైన ఒకే దేవుని జ్ఞానమే ఉన్నప్పటికి మాయయొక్క మత ప్రభావము

వలన అన్ని మతములలోను ఒకే దేవున్ని గురించి చెప్పారని మనుషులకు తెలియకుండా పోయినది. క్రైస్తవులు మా దేవుడు "యెహోవా" అని అంటారు. ముస్లీమ్‌లు మా దేవుడు "అల్లా" అంటారు. హిందువుల విషయానికివస్తే వాళ్ళ దేవుడు ఎవరో కూడా వారికే తెలియని స్థితిలో ఉన్నారు. మతము అను మాయ అందరికీ ఒకే దేవుడనీ, అందరిని సృష్ఠించినవాడొకడేననీ, సృష్ఠి మొదటినుండి చివరి వరకు జగతికంతా ఒకరే అధిపతియనీ, అతనే దేవుడని తెలియకుండా చేసినది. మా దేవుడు వారి దేవునికంటే గొప్ప అను భావమును అన్ని మతములలోను మాయ చొప్పించి పెట్టినది. అట్లు అనుకోవడమే పెద్దమాయ అని ఎవరూ అనుకోవడము లేదు. అంతేకాక మాయ మరొక భావమును కూడా మనుషులలో ఉండునట్లు చేసినది. అది ఏమనగా! మేము క్రైస్తవులము అనువారు బైబిలును గురించి మాట్లాడినా, ప్రభువును గురించి మాట్లాడినా సంతోషముగా వింటారు. అదే హిందూ మతములోని వారు భగవద్గీతను గురించి మాట్లాడినా, శ్రీకృష్ణున్ని గురించి మాట్లాడినా విసుగుకొని వినరు. వినకపోవడమే కాకుండా శ్రీకృష్ణున్ని గురించి, భగవద్గీతను గురించి వ్యతిరేఖముగా మాట్లాడుదురు. అలావారు ప్రవర్తించుటకు ముఖ్యమైన కారణము ఏమంటే, మాయ మతమను ముసుగును వారికి తగిలించి దేవున్ని, దేవుని జ్ఞానమును పరిమితి చేసి చూపిస్తున్నది. కావున దేవుడు పూర్వమునుండి ఉన్నాడనీ, ఆయన కలియుగములో ప్రభువు రూపములో వచ్చినట్లు ఇతర యుగములలో, ఇతర రూపములలో వచ్చియుండుననీ, బైబిలులో దేవుడు ప్రభువు రూపములో చెప్పినట్లు గీతలో కూడా దేవుడు చెప్పియుండునేమోనని యోచించకుండా చేయుచున్నది. తాను నిర్మించిన మతమను పరిధిని దాటిపోయి విశాలముగా ఉన్న దేవున్ని మానవులు తెలుసుకొంటారేమోనని మాయకు దిగులు. అందువలన మాయ

ప్రభావమున్నవారు మేము ఇతర మతముల పుస్తకములు చదవము, ఇతర బోధలు వినము అంటుంటారు. నిజముగా భర్తను ప్రేమించు భార్య బయట ఇతర పురుషున్ని చూచినా భర్తను వదిలి వాని వెంటపోదుకదా! అలాంటపుడు ఏ మతములోని వారైనా వారి మతములోని దేవున్ని పూర్తిగా విశ్వసించియుంటే ఇతర మతముల పుస్తకములు చదివినా, బోధలు వినినా వారి దేవున్ని వదలి పెట్టరు కదా! తన భర్త మీద నమ్మకము లేని భార్య ఇతర పురుషున్ని చూస్తే తానెక్కడ తనభర్తను వదలిపోతానో అను భయమున్నపుడు ఇతరులను చూడకుండా జాగ్రత్తపడును. అలాగే తన దేవుని మీద విశ్వాసములేని మనిషి ఇతర మతముల పుస్తకములు చదివినా, బోధలు వినినా తన దేవున్ని, తన మతమును వదలి పోతానేమోనను భయముండును. అందువలన అటువంటివారు ఇతర మతగ్రంథములను ఇతర బోధలను వినరు, చదువరు.

ఇక హిందూమతములోని వారిని చూస్తే వారు ఒక దేవున్నికాక ఎందరో దేవుడు కాని దేవుళ్ళను వారే సృష్ఠించుకొని ఇష్టదేవుడు, ఇంటిదేవుడు, కులదేవుడని రకరకముల దేవుళ్ళను ఆరాధిస్తున్నారు. ఒక్క దేవున్నికాక ఎందరో దేవుళ్ళకు అలవాటుపడిన వారు కనుక ఇతర మతములోని దేవుని మీద కూడా వీరికి పెద్ద అసూయా భావముండదు. అందువలన క్రైస్తవులు పుస్తకములు ఇచ్చినా వాటిని చదువగలుగుచున్నారు. వారి బోధలు చెప్పినా వినగలుగుచున్నారు. ఎందరో హిందూమతమును వదిలి క్రైస్తవమతములోనికి పోయిన వారు కూడా ఉన్నారు. ఇదంతయూ గమనిస్తున్న హిందూమత గురువులు, స్వాములు, పీఠాధిపతులు తాము చెప్పిన బోధలే వినాలి, తాము వ్రాసిన గ్రంథములే చదవాలి అని తమ వర్గమువారికి బోధించను మొదలుపెట్టారు. హిందూమతములో అద్వైతము,

విశిష్టాద్వైతము, ద్వైతము అను చీలికలుండడమేకాక అచల సమాజమనీ, బ్రహ్మకుమారి సమాజమనీ, సిద్ధయోగ సమాజమనీ, పిరమిడ్ సమాజ మనీ చాలా రకముల చీలికలు గలవు. హిందూమతములో వారివారి సమాజమును బలపరచుకొనేదానికి, వారి సమాజములోనివారు ఇతర సమాజములోనికి పోతారేమోనని భయముతో ఇందూమతములోనే ఇతరులు వ్రాసిన పుస్తకములు చదువకూడదని తాము వ్రాసిన పుస్తకములు మాత్రమే చదువవలెనని ఆంక్షలు పెట్టియుందురు. ఇదెలా ఉందంటే తాను అందవిహీనుడైయున్నవాడు తన భార్య తనకంటే అందముగా ఉన్నవాడిని చూస్తే తనను ఎక్కడ వదిలిపెట్టిపోతుందోనను భయముతో నీవు ఇతరుల వైపు చూడవద్దు అని తన భార్యను ఆజ్ఞాపించినట్లు కొందరు గురువులు, స్వాములు తమ భక్తులకు, శిష్యులకు ఇతర పుస్తకములు చదవవద్దనీ, ఇతర బోధలు వినవద్దని ఆజ్ఞాపించుచున్నారు. ఇలాంటి 'నా మతము' అను సంకుచిత భావములు, 'నా జ్ఞానము' అను స్వార్థభావములు మతముల లోను, భక్త సమాజములలోను పెరిగిపోయాయి. క్రైస్తవులు ఇచ్చిన పుస్తకములను హిందువులు నిరాటంకముగా తీసుకొంటున్నారు. మీరిచ్చిన పుస్తకములు మేము తీసుకోమనీ, మేము చదువమని హిందువులు అనడము లేదు. కానీ ఒక హిందువు హిందూమతానికి సంబంధించిన పుస్తకమును క్రైస్తవులకు ఇస్తే క్రైస్తవులు "మీరిచ్చిన పుస్తకమును మేము చదువము మాకు వద్దని" నిరాకరిస్తు ముఖాన్నే చెప్పుచున్నారు. ఇదంతా మాయయొక్క మత ప్రభావము కాదా?

విశ్వమంతటినీ సృష్ఠించిన దేవుడు, విశ్వమునంతటినీ అంతము చేయగల దేవుడు, విశ్వములోని మానవులకందరికీ అధిపతియైన దేవుడు, అన్ని మతములలోను నాయకుడైయున్న దేవుడు సృష్ఠించినవే మతగ్రంథము

(పథగ్రంథము) లైన భగవద్గీత, బైబిలు, ఖురాన్‌లు. దేవుడు తెలియజేసిన జ్ఞానసమాచారము ఆ మూడు గ్రంథములలో కలదు. కానీ దేవుడు తెలియజేసిన జ్ఞానమును కూడా మనుషులకు అర్థము కాకుండా చేయడమే మాయయొక్క పనితనము. గ్రంథములలో కూడా తన ఛాయను చూపుకోవడము మాయ యొక్క చాకచక్యము. ఉదాహరణకు భగవద్గీతను తీసుకొంటే దేవుడు చెప్పిన చాలా శ్లోకములను మాయ మనుషులకు అర్థము కాకుండా చేసినది. సంస్కృత శ్లోకములకు వివరము చెప్పిన స్వాముల చేతనే తప్పుడు వివరమును వ్రాయించింది. ఎక్కడాలేని స్వర్గ, నరక లోకములు ప్రత్యేకముగా ఉన్నవని నమ్మించింది. మొత్తము మీద దేవుడు చెప్పిన భావమును కేవలము ఐదు శాతము కూడా అర్థము కాకుండ చేసినది. చాలాచోట్ల భగవద్గీతలో దేవుడు చెప్పిన ఉద్దేశ్యమునకు వ్యతిరేఖ భావములను దేవుడే చెప్పినట్లు నమ్మించినది. అందువలన హిందూ మతములో భగవద్గీత ఇప్పటికీ పూర్తి భావసహితముగా లేకుండా భావరహితముగా ఉన్నదనియే చెప్పవచ్చును.

ఇక బైబిలు విషయానికి వస్తే అందులో మాయ, దేవుని మాటలను మనుషుల మాటలను కలిపివేసినది. దేవుని మాటను మనుషుల మాటలను సమానముగా లెక్కించుకొనునట్లు చేసినది. ఇది ప్రత్యేకమైన దేవుని మాట కదాయని గుర్తించనట్లు మనుషుల మాటలను చొప్పించినది. బైబిలులోని అన్ని వాక్యములు ముఖ్యమేనన్నట్లు దానిలోని ఒక పొల్లు కూడా తీసివేయకూడదని మనుషులను శాసించినది. అందువలన క్రైస్తవులు బైబిలులోని దేవుని వాక్యములను మాత్రము గుర్తించక ప్రతివాక్యము ముఖ్యమేననుకొంటున్నారు. తమకు తెలియకనే దేవుని వాక్యమునకు వ్యతిరేఖమైన భావములను తమలో పెట్టుకొనుచున్నారు. దైవము చెప్పిన

భావమునకు కొందరు ఏ విధముగా వ్యతిరేఖముగా ఉన్నారో రెండు ఉదాహరణలను తీసుకొని చూస్తాము. బైబిలును చదివిన క్రైస్తవులు మనిషికి ఒకే జన్మకలదు, చచ్చిన తర్వాత ఎవడూ పుట్టడని, పునర్జన్మ లేదని అంటున్నారు. అది నిజమేనని చాలామంది నమ్ముచున్నారు. ఈ మాట దేవుని మాటకు వ్యతిరేఖమైనదని ఎవరూ యోచించలేదు. దేవునికి వ్యతిరేఖమైన ఆ విషయమును వివరించుకొందాము. బైబిలు కొత్త నిబంధనలో మత్తయి సువార్త 12వ అధ్యాయమందు 32వ వాక్యములో ఈ విధముగా ఉన్నది. **"మనుష్య కుమారునికి విరోధముగా మాటలాడు వానికి పాపక్షమాపణ కలదుగానీ, పరిశుద్ధాత్మకు విరోధముగా మాటలాడు వానికి ఈయుగమందైనను రాబోవు యుగమందైనను పాప క్షమాపణ లేదు."** ఈ వాక్యమును విడదీసి చూస్తే ఒకరు దేవుని కుమారుడు, మరియొకరు పరిశుద్ధాత్మ, మూడవవాడు విరోధముగా మాటలాడువాడు. ఈ ముగ్గురిలో ఎల్లపుడు సర్వము అణువణువునా వ్యాపించి, అందరికీ సాక్షిగాయున్న పరమాత్మయే పరిశుద్ధాత్మ లేక దేవుడు. దేవునికి అపరిశుద్ధమైన పాపము అంటదు కావున ఆయనను పరిశుద్ధాత్మ అంటున్నాము. పరిశుద్ధాత్మకు ఆకారములేదు, ఆకారము లేనివానికి పేరు కూడా యుండదు. అందువలన ఆయనను రూప నామములు లేనివాడని కూడా అనుచుందుము. రూపము, పేరులేని దేవుడు, అంతటా వ్యాపించియున్న దేవుడు, తన విషయమును ప్రజలకు చెప్పుటకు తన వ్యాపకము నుండి ఒక భాగమును మనిషిగా పుట్టింపజేసి మనుషులతో మాట్లాడును. దేవుడే స్వయముగా తన కోట్లాది అంశలలో ఒక అంశతో పుట్టుచున్నాడు కావున ఆయనను 'మనుష్య కుమారుడు' అని బైబిలులో, 'భగవంతుడని' భగవద్గీతలో అంటున్నారు. దేవుని ఒక భాగమును దేవుని కుమారుడనీ, కోట్లాది భాగములను పరిశుద్ధాత్మ అని అంటున్నాము. పరిశుద్ధాత్మ ఎల్లవేళల విశ్వమంతా

వ్యాపించియుండగా, దేవుని కుమారుడు మాత్రము భూమిమీద కొన్ని వేల సంవత్సరముకొకమారు పుట్టుచుండును. మాయ ప్రభావము వలన భూమిమీద అధర్మములు ఎక్కువైనపుడు దేవుని ధర్మము తెలియకుండా పోయినపుడు దేవుని సంకల్పముతో దేవుని అంశ భూమి మీద పుట్టును. అలా పుట్టినవాడు కూడా బయటికి మనిషిగానే ఉండును. ఇక మూడవ వాడైన మనిషి సృష్ట్యాదిలోనే పుట్టియున్నాడు. మాయమార్గములో నడుచు మనిషి భూమిమీద నివసించు స్థలమును, బంధువర్గమును కొన్ని సంవత్సరములకొకమారు మరణము అను దానితో విడిపోతూ, పుట్టుక అనుదానితో క్రొత్త నివాసస్థలమును, క్రొత్త బంధువర్గమును పొందు చుండును. ఇదంతయూ ఒక ఉద్యోగి ట్రాన్స్‌ఫర్ (బదిలి) అయి మరొక ఊరిలో ఉద్యోగము చేసినట్లు, ఒక జీవుడు ఒక శరీరమును వదిలి వేరొక శరీరమును పొంది అక్కడ క్రొత్త జీవితమును సాగించుచుండును. దీనినిబట్టి ఎల్లపుడు భూమిమీద ఉండువాడు మూడవవాడైన జీవుడు (మనిషి). మొదటివాడైన పరిశుద్ధాత్మ అసలు పుట్టడు. రెండవవాడైన దేవుని కుమారుడు (భగవంతుడు) అవసరమొచ్చినపుడు కొన్ని వేలసంవత్సరముల కొకసారి పుట్టుచుండునని తెలియుచున్నది. రెండవవాడైన భగవంతుడు లేక దేవుని కుమారుడు మనిషికి కర్మలు (పాపపుణ్యములు) అంటకుండుటకు మనిషి కర్మల నుండి బయటపడుటకు అవసరమైన దేవుని జ్ఞానమును తెలుపుటకు పుట్టుచుండగా, మనిషి మాత్రము పాపమును అనుభవించుటకు పుట్టుచుండును. కర్మను అనుభవించుచు క్రొత్తకర్మను మనిషి సంపాదించు కొనుచు, క్రొత్తదానిని అనుభవించుటకు, క్రొత్త జాగా, క్రొత్త బంధువులను, క్రొత్త శరీరముతో చేరుచున్నాడు. పాతకర్మను అనుభవిస్తూ క్రొత్తకర్మను ప్రపంచకార్యములలో ప్రపంచ సంబంధముగ సంపాదించుకొనుచున్నాడు. ప్రపంచ సంబంధముగ సంపాదించుకొన్న కర్మను అనుభవిస్తే అయి

పోతుంది. ఎందుకనగా ప్రపంచ సంబంధకర్మ పరిమితమైనది, దానిని పరిమిత కాలములో అనుభవిస్తే అయిపోతుంది. కానీ దేవుడు అపరిమితమైనవాడు కావున దైవసంబంధముగ చేసుకొన్న కర్మ అపరిమిత మైనది. మరియు దాని అనుభవము కూడా అపరిమిత కాలముండును. అందువలన పరిశుద్ధాత్మను నిందించితే ఈ యుగమందైనను, రాబోవు యుగమందైనను పాపక్షమాపణ లేదన్నారు. దేవుని నిందించినవాడు యుగయుగముల పర్యంతము పాపము అనుభవిస్తూనే ఉండవలయునని అర్థము కాదా! దేవున్ని దూషించిన మనిషి ఈ యుగమంతయు మరియు రాబోవు యుగములంతయు ఉండుననియేగా అర్థము. ఆ విధముగ ఎవడైనా ఉన్నాడా? అని చూస్తే ఒకే మనిషి అనగా దేవున్ని దూషించినవాడు ఎవడూ నూరు సంవత్సరములకంటే ఎక్కువ కాలము బ్రతుకలేదు. కానీ అక్కడ యుగ పర్యంతముండునను దేవుని మాట వ్యర్థము కాదుకదా! అంటే దేవుని వాక్కు ప్రకారము యుగయుగముల వరకు వాడుండుట సత్యమే. అది ఎలా అంటే నిందించినవాడు చస్తూ పుట్టుచూ, జన్మలు పొందుచూ, శరీరములు మారుచూ దేవున్ని దూషించిన పాపమును అనుభవించుచుండును. ఇక్కడ మనిషికి జన్మలున్నాయంటేనే దేవుని మాట నెరవేరుతుంది. మనిషికి జన్మలులేవంటే దేవుని మాట అసత్యమౌతుంది. దేవుని మాటకు వ్యతిరేఖముగా మాయ మనిషికి జన్మలు లేవని మనుషుల చేతనే చెప్పిస్తుంది. అయినా జ్ఞానము ప్రకారము అది నిలువదు. జ్ఞానము ప్రకారము దేవున్ని దూషించిన మనిషి చిరకాలము భూమిమీద పాపమును అనుభవిస్తూనే ఉండుట సత్యము.

సాతాన్ మరియు సైతాన్ అను పేర్లతో చలామణి అగు మాయ చాలా గొప్పది. దానిని జయించుట దుస్సాధ్యమని స్వయముగ భగవంతుడే ***"మమమాయ దురత్యయా"*** అని భగవద్గీతలో చెప్పాడు. అందువలన

మాయ దేవుని మార్గములో ప్రయాణించువారిని దేవుని జ్ఞానమునకు వ్యతిరేఖముగా తయారుచేసి తన జ్ఞానమార్గములో ప్రయాణించునట్లు చేయును. అదియూ ఎంత గొప్ప మేథావిగా చేయుచున్నదనగా! ప్రతి ఒక్కన్ని దేవుని మార్గములోనే ఉన్నట్లు భ్రమింపజేసి తన మార్గములో నడుపుకొనుచున్నది. ప్రత్యేకించి దేవుని జ్ఞానమును బోధించువారినే అలా చేయుచున్నది. మాయ అలా చేయడము వలన వారి బోధలను వినువారు గానీ, వారిని అనుసరించువారు గానీ, దేవుని మార్గములోనే ఉన్నామను కొనుచూనే మాయమార్గములో ఉండి పోగలరు. మాయ మార్గమునే దేవుని మార్గముగా నమ్మియుండగలరు. ఈ విధముగా మాయ ఎక్కడ కూడా తన పేరును పైకి కనిపించకుండా చేసి తన దారిలోనే అందరినీ నడుచునట్లు చేయుచున్నది. క్రైస్తవ మతములో జ్ఞానులమనుకొన్న వారిని సహితము మాయ దేవుని మాటకు వ్యతిరేఖముగా తనకు అనుకూలముగా ఎలా నడుపుచున్నదో తెలియుటకు మరియొక ఉదాహరణను చూచెదము.

మత్తయి సువార్త 23వ అధ్యాయములో 9వ వచనములో ఈ విధముగ గలదు. **"భూమిమీద ఎవనికైనను తండ్రి అని పేరు పెట్టవద్దు. ఒక్కడే మీ తండ్రి, ఆయన పరలోకమందున్నాడు."** ఈ మాట స్వచ్ఛముగా దేవుని కుమారుడైన ఏసుప్రభువు చెప్పిన మాట. పైకి కనిపించు ప్రభువు చెప్పినప్పటికి దానిని పూర్తి దేవుని మాటగానే లెక్కించాలి. ఎందుకనగా చెప్పినది దేవుని అంశయే కావున ఆ మాట నిజముగా దేవుని మాటయే. దేవుని మీద విశ్వాసమున్న వారు దేవుని మాటను తప్పనిసరిగా వినాలికదా! కానీ మాయ దేవుని మీద విశ్వాసమున్న వారినే ఆ మాట వినకుండా చేసినది. అదియూ మేము బోధకులము, దేవుని జ్ఞానాన్ని గురించి వివరముగా చెప్పగలము అనువారిమీదనే మాయ పట్టు సాధించి, వారిని

దేవుని మార్గములోనే ఉన్నట్లు నమ్మించి, దేవుని బోధనే బోధించునట్లు భ్రమింపచేసి, చివరకు దేవుని మాటకు వ్యతిరేఖముగా వారి నోటనే తన మాటను పలికించుచున్నది. దేవుని జ్ఞానమును బోధించు బోధకులైన కొందరిని మాయ తండ్రి అని పేరు పెట్టి పిలుచునట్లు చేసినది. బోధకుల చేతనే నేను ఫాదర్ (తండ్రి) ని అని చెప్పించుచున్నది. కొందరి బోధకులకు హోదాగా ఫాదర్ (తండ్రి) అను పేరును కల్గించి సమాజములో గౌరవ మర్యాదలు కలుగజేయుచున్నది.

నేడు క్రైస్తవమతములో బోధకులైన ఫాదర్‌లు ఎందరో గలరు. వారు బైబిలులోని విషయములనే చెప్పుచున్నప్పటికీ తాము మత్తయి 23, 9వ వచనములోనున్న దేవుని వాక్కుకు వ్యతిరేఖముగా ఫాదర్ అని ఇతరుల చేత పిలిపించుకొంటున్నాము కదా! అను ధ్యాస వారిలో ఏమాత్రము లేదు. ఫాదర్ పేరుతో బోధకులకు కొంత హోదాను కల్పించిన మాయ మేము దేవుని సేవకులమని భ్రమింపచేసి, ఆ భ్రమలో తాము దేవుని మాటకు వ్యతిరేఖముగా ఉన్నాము కదా, అను జ్ఞప్తిని లేకుండా చేసినది. చూచారా మాయ ఎంత బలమైనదో! దేవుని మీద దాదాపు యాభైశాతము విశ్వాసమున్న క్రైస్తవులలోనే మాయ ఇంత బలముగా ఉంటే, కేవలము రెండు శాతము విశ్వాసమున్న హిందువులలో మాయ ఎంత భయంకరముగా ఉండునో ఊహించుకోండి. మాయకు ఎక్కువ పట్టువున్న మతము హిందూమతమే. ఎందుకనగా హిందూమతములో దేవుని మీద విశ్వాసము రెండు శాతమే ఉన్నది, కనుక మిగతా 98 శాతము మాయకు బలముగా ఉన్నది. సగటు హిందూమతము మీద చెప్పునది 98 శాతమని తెలియవలెను. విడదీసి చెప్పుకొంటే ఒక మనిషిలో 90 శాతము దేవుని మీద విశ్వాసముండవచ్చును. అపుడు వానిలో మాయ కేవలము 10 శాతము మాత్రము పని చేయుచున్నదని చెప్పవచ్చును. అలాగే ఒకనిలో

100 శాతము దేవుని మీద విశ్వాసము లేకుండవచ్చును. అటువంటి వానిలో 100 శాతము మాయ పని చేయుచున్నదని తెలియుచున్నది. ఈ విధముగా లెక్కించి చూస్తే హిందూ మతములో కూడా కొందరు అక్కడక్కడ బహు అరుదుగా దేవునిమీద విశ్వాసమున్న వారు ఉండవచ్చును. ప్రస్తుతము హిందూమతములోనున్న పరిస్థితిని బట్టి, జ్ఞానులను అజ్ఞానులను అందరిని దృష్ఠిలో పెట్టుకొని సగటుకు మాయ ఎక్కువ 98 శాతము హిందూమతములో బలము కలిగియున్నదని చెప్పవచ్చును. అన్నిటికంటే వెనుక దాదాపు 1400 సంవత్సరముల క్రితము పుట్టిన ఇస్లామ్ మతములో మాయ కేవలము 10 శాతము బలము కలిగియుండగా, దానికంటే 600 సంవత్సరముల ముందు పుట్టిన క్రైస్తవ మతములో 50 శాతము బలము కలిగియున్నది. మాయ 98 శాతము హిందూమతములో ఉన్నదను మా మాట హిందువులైన కొందరికి మ్రింగుడుపడని విషయము. కానీ ఈ గ్రంథమును చివరివరకు చదివితే నేను చెప్పిన మాటను మీరు కూడా చెప్పగలరు.

ఇంతవరకు మనుషులలోగల మతములందు గల మాయను విశ్లేషించి చెప్పుకొన్నాము. ఇపుడు చెప్పునదేమంటే హిందూ మతగ్రంథమైన భగవద్గీతలో జ్ఞానము ఎంతమేరకున్నది అను విషయమును గురించి చెప్పుకొందాము. భగవద్గీత 700 శ్లోకముల గ్రంథము. అందులో 54 శ్లోకములు మాయకు సంబంధించిన కల్పిత శ్లోకములు గలవు. దీనినిబట్టి దాదాపు 93 శాతము దైవజ్ఞానము, 7 శాతము మాయజ్ఞానము భగవద్గీతలో కలదని చెప్పవచ్చును. అన్ని మతగ్రంథములకంటే ఎక్కువ శాతము దైవజ్ఞానమున్న గ్రంథము భగవద్గీత. భగవద్గీత హిందూ మతగ్రంథముగా ప్రచారము చేయబడినది. కానీ వాస్తవానికి భగవద్గీత హిందూమతగ్రంథము కాదు. ఇంకా వివరించి చెప్పితే అది ఒక మతగ్రంథమేకాదు. అన్ని

మతములలోని **సర్వమానవులకు సంబంధించిన జ్ఞానము భగద్గీతలో కలదు.** కావున గీతను మతగ్రంథమనుట పొరపాటనియే చెప్పవచ్చును. భగవద్గీతలో 93 శాతము దైవజ్ఞానము ఇమిడియుండగా, హిందువులుగా ఉన్నవారు సగటుకు గీతలోని జ్ఞానమును కేవలము 3 శాతము కూడా తెలుసుకోలేదు. భగవద్గీత మా మతగ్రంథమని చెప్పుకొను హిందువులకే దానిలో భావము 3 శాతము కూడా అర్థముకానపుడు, దానిని ఏమాత్రము చదవని ఇతర మతముల వారికి దానిలోని జ్ఞానము ఎలా తెలియును? దాదాపు 5200 సంవత్సరములనుండి ఉన్న భగవద్గీత హిందువులకు ఇంతవరకు అర్థము కాలేదని చెప్పవచ్చును. ఇక్కడ కొందరికొక ప్రశ్నవచ్చి భగవద్గీత భావము సామాన్య మనుషులకు తెలియకుండాపోయి యుండవచ్చును. కానీ స్వామిజీలకు, పీఠాధిపతులకు కూడా తెలియదంటారా? అని ప్రశ్నించ వచ్చును. దానికి మా జవాబు ఏమనగా! స్వామిజీలు వ్రాసిన గీత వివరమునే కదా సామాన్య మనుషులు చదువుతున్నది. దేవుడు చెప్పిన దొకటైతే వ్రాసినవారు చెప్పిన భావమొకటున్నపుడు, వ్రాసినవారికి అర్థము కాకనే అలా వ్రాశారని చెప్పాలి. స్వామిజీలకే అర్థముకానపుడు సామాన్యులకు ఎలా అర్థమవుతుంది? అందువలన గీతలో 93 శాతము జ్ఞానమున్నా దానిని మనుషులు గ్రహించినది 3 శాతమేనని అంటున్నాము. ఇపుడు అనుమానము వచ్చి ఎవరికీ తెలియనిది నీకెలా తెలుసు? ఇంతవరకు చెప్పిన వారికంటే నీవు బాగా తెలిసినవాడివా? అని కూడా కొందరు నన్ను ప్రశ్నించవచ్చును. దానికి జవాబుగా చెప్పునదేమంటే నేను అందరికంటే తక్కువ తెలిసినవాడినేనని ఒప్పుకుంటున్నాను. ఒక మనిషిగా ఈ వ్రాతకు నాకు ఎటువంటి సంబంధము లేదు. నేను కేవలము కలములాంటి వాడినే. ఈ వ్రాతను వ్రాయించినవాడు, ఉన్న సత్యమును చెప్పువాడు నా ప్రక్కనున్నవాడు (ఆత్మ) అని చెప్పుచున్నాను. ఆనాడు గీతను చెప్పినవాడు

ఆత్మే కావున గీతలోని సత్యమేమో ఆయనకే తెలుసు. కావున ఆయనే హిందువులలో ఎంత జ్ఞానమున్నది చెప్పాడు.

ఇంకా మేము చెప్పునదేమనగా, 93 శాతము దైవజ్ఞానమున్న భగవద్గీతను 3 శాతము అర్థము చేసుకొన్న మనుషులు దానిని ఎంతవరకు గౌరవిస్తున్నారు అని చూచుకొందాము. ఇతర మతములతో పోల్చి చూస్తే ఇస్లామ్ మతములో ఖురాన్ ఎంతో గౌరవించబడుతూ ఉన్నది. దేవునితో సమాన విలువనిస్తూ దానిని ఎంతో పవిత్రముగ చూచుకొంటుంటారు. దానిని క్రింద పెట్టుటకు కూడా వారి మనస్సు ఒప్పదు. దానికి ఉన్నత స్థానమును కల్పించియుందురు. ఇస్లామ్ మతములో ఐదు సంవత్సరముల వయస్సున్న పిల్లవానికి కూడా ఖురాన్ అంటే ఏమిటో తెలుసు. ముస్లీమ్‌లు ఐదు సంవత్సరముల పిల్లవాడిని కూడా దైవప్రార్థన కొరకు మసీద్‌కు తీసుకపోయి ఖురాన్‌ను గురించి అవగాహనకొచ్చునట్లు చేయుచుందురు. యుక్తవయస్సు వచ్చిన ఆడపిల్లకు పెళ్లి కాకముందే ఖురాన్‌ను చదవడము నేర్పించి ప్రతిదినము ఖురాన్‌ను చదివేటట్లు అలవాటు చేయుచున్నారు. ముఖ్యముగ చెప్పాలంటే ఇస్లామ్ మతములో ఉన్నవారు ఎక్కువ శాతము ఖురాన్‌ను తమ ప్రాణముకంటే ఎక్కువగా చూచుకొంటున్నారు. వారిలో ఎంత పెద్ద ఉద్యోగి అయినా, దేశానికి రాజయినా వారి గ్రంథమును, వారి దేవుని జ్ఞానమును అనుసరించే నడుచుకొనుచుందురు. ఇస్లామ్ దేశములలో దేవునికి వ్యతిరేఖమైన చట్టముగానీ, రాజ్యాంగముగానీ ఉండదు.

ఇక హిందూదేశములోనున్న హిందువులలో దేవుడూ, దేవుడు చెప్పిన భగవద్గీత యొక్క విలువ ఎట్లున్నదో వివరించుకొందాము. హిందూ దేశములోని హిందువులకు నూటికి ఎనభైమందికి భగవద్గీత అంటే ఏమిటో తెలియదు. భగవద్గీతను గురించి విని కూడా దానిని చూడనివారు 10

శాతము గలరు. భగవద్గీతను చదవకుండా చూచినవారు నూటికి 5 మంది గలరు. గీతను పూర్తి చదివినవారు నూటికి 5 మందే గలరు.

**భగవద్గీతను ఏమాత్రము తెలియనివారు నూటికి 80 మంది హిందువులు గలరు.**

**భగవద్గీతను గురించి వినికూడా దానిని చూడనివారు నూటికి 10 మంది హిందువులు గలరు.**

**భగవద్గీతను చూచి కూడా దానిని చదవనివారు నూటికి 5 మంది హిందువులు కలరు.**

**భగవద్గీతను చూచి దానిని శ్రద్ధగా చదివినవారు నూటికి 5 మంది హిందువులు కలరు.**

హిందూమతములో తప్ప ఏ మతములోని వారికైనా వారి మత గ్రంథమును గురించి పూర్తి తెలిసియుండును. మతగ్రంథమును చూడనివారు ఎవరూ ఉండరు. చదువురాని వారు చదవలేక పోవచ్చును. కానీ పవిత్రముగా చూచుచుందురు. కేవలము ఒక్క హిందూమతములోనే భగవద్గీతను తెలియనివారు, చూడనివారు, చదువువచ్చి చదవనివారు కలరు. కొన్ని పల్లెలలోనికి పోయి చూస్తే ఊరు మొత్తము భగవద్గీత అంటే ఏమిటో తెలియనివారు కూడా కలరు. మండల స్థాయిలో, జిల్లాస్థాయిలో మరియు పట్టణములలో మాత్రము గీతను గురించి తెలిసినవారు కొందరు కలరు. ఇపుడు ప్రస్తుతకాలములో యువతీ యువకులుగానున్న వారిని చూస్తే కొంతకాలము చదువులు తర్వాత ఉద్యోగములు తప్ప గీతను గురించి ఏమాత్రము తెలియని స్థితిలో ఉన్నారు. యాభైయేళ్ళు వయస్సున్న వారిని కదిలించి భగవద్గీతను గురించి చెప్పితే మాకు ఈ వయస్సులో ఎందుకు?

పూర్తి ముసలివాళ్ళమై ఏ పని చేయలేనపుడు తీరిగ్గా చదువుకోవచ్చును, ఇపుడు దానితో ఏమి పనియుంది? అంటున్నారు. ఎవరైనా చిన్న వయస్సులోని వారు 15 నుండి 20 సంవత్సరముల వయస్సున్నవారు గీతను గురించి, అందులోని జ్ఞానమును గురించి తెలుసుకోవాలనుకుంటే ఇంటిలోని తల్లిదండ్రులు వ్యతిరేఖమైపోయి జ్ఞానము తెలుసుకోవాలనుకుంటే ఇంటిలోనికి రావద్దు. మాతో సంబంధము పెట్టుకోవద్దు అనేవాళ్ళు కూడా కలరు. భార్య దైవజ్ఞానము తెలుసుకొంటే సరిపోని భర్తలున్నారు. అంతేకాదు భర్త జ్ఞానము తెలుసుకొనుటకు ప్రయత్నిస్తే విడాకులిస్తామనే భార్యలున్నారు. కొడుకు భగవద్గీతను దాచిపెట్టుకొని దొంగగా చదువుతూవుంటే చూచిన తండ్రి భగవద్గీతను అగ్గిపుల్లతో అంటించి కాల్చివేశాడు. ఇదీ హిందూ మతములో భగవద్గీతకూ అందులోని జ్ఞానమునకూ ఉన్నవిలువ!

హిందూమతములోని పరిస్థితిని ప్రక్కనుండి గమనిస్తున్న క్రైస్తవులు వారి మతప్రచారమే ముఖ్యమైన ఘట్టముగా పెట్టుకొన్నవారై జ్ఞానము తెలియని హిందువులను మాటలగారడీతో వారి మతములోనికి సులభముగా చేర్చుకొంటున్నారు. హిందూమతములో ఏమాత్రము జ్ఞానము తెలియని వారు, భగవద్గీత పేరు కూడా విననివారు, తాము ఏ మతములో ఉన్నామోనని కూడా తెలియనివారు, క్రైస్తవ మతములోనికి సులభముగా చేరిపోయి మేము క్రైస్తవులము అంటున్నారు. అంతవరకు తాము హిందువులమని కూడా వారికి తెలియదు కావున క్రైస్తవులమని చెప్పుకొవడముతో ఏదో డిగ్రీ పొందినంత సంతోషము పొందుచున్నారు. ఈ విధముగా హిందూ మతములోని వారు క్రైస్తవ మతములోనికి చేరిపోతూ వుంటే, కొందరు హిందూ మతాభిమానులు మా మతము పతనమైపోతున్నది, క్రైస్తవమతము అభివృద్ధి అగుచున్నదని బాధపడుచున్నారు. అలా వాపోవు వారందరు కొన్ని గుంపులుగా తయారై హిందూమత రక్షణ సమితియనీ,

హిందూ మత ఉద్ధరణ కమిటీయనీ, హిందూపరిషత్‌యనీ అనేక రక సంస్థలుగా ఏర్పడి మతమార్పిడి జరగకుండా చూచుకోవాలనుకొన్నారు. సమస్య జ్ఞానము వలన పరిష్కారమవుతుందని తెలియక పోవడము వలన, ఈ గుంపులలో జ్ఞానము తెలిసినవారు లేకపోవడము వలన క్రైస్తవబోధకులకు వారి మతమును గురించి హిందువులలో ప్రచారము చేయకూడదని చెప్పారు. క్రైస్తవ బోధకుల ముఖ్యమైన పని మత ప్రచారమే కావున వారు, వీరి మాటను ఖాతరు చేయకుండా బోధలు చెప్పడము, వీరు వారి మీద భౌతికముగా దాడి చేయడము జరుగుచున్నది. అయినా ప్రయోజనము లేదు. వారు ఎలాగో ఒకలాగున బోధలు చెప్పుచూనే ఉన్నారు. ఈ మధ్యన హిందువులలో ఎన్ని పరిషత్‌లు ఏర్పడినా క్రైస్తవులు ప్రత్యేక టీ.వి ఛానళ్ళు పెట్టి వారి బోధలను ప్రచారము చేస్తూనేయున్నారు.

ఇల్లు అంటుకొన్నపుడు దానిని ఆర్పేదానికి నీరును ఉప యోగించాలి. అట్లుకాక నీటివలెనున్న నూనెను నీరేలేనని ఉపయోగిస్తే మంట మరింత మండుతుంది, కానీ నూనె వలన ఆరిపోదు. అదే విధముగా మత మార్పిడి సమస్యను అధిగమించడానికి జ్ఞానాన్ని ఉపయోగిస్తే సమస్య తీరిపోతుంది, కానీ బలమునుపయోగిస్తే సమస్య అణిగిపోదు, మరింత జఠిలమౌతుంది. మతమార్పిడి సమస్య పరిష్కారము కావడానికి భౌతిక దాడులు పనికిరావు. అభౌతికమును తెలుపు జ్ఞానము కావాలి. అటువంటి జ్ఞానము హిందువులలో కనిపించడము లేదు. దైవజ్ఞానము గానీ, ఆత్మజ్ఞానము గానీ ఆవగింజంత కూడాలేని హిందువులగుంపుల వలన హిందూమతమునకే నష్టము ఏర్పడుచున్నది. గ్రుడ్డివాడు దొంగను కొట్టాలని కట్టెను తీసుకొని తన ఇంటిలోని కుండలనే పగులకొట్టుకున్నట్లు, అజ్ఞాన గ్రుడ్డితనముగల హిందూసంస్థలు తమ మతాన్ని ఉద్ధరించేది పోయి, తమ మతాన్ని తామే దిగజారిపోవునట్లు చేయుచున్నవి. ఈ మాటను మేమంటే

కొందరికి కోపమొచ్చునేమో కానీ  మేము చెప్పబోవు యదార్థ సంఘటనను చదివిన తర్వాత మీలో ఏమనిపిస్తుందో మీరే చూచుకోండి!  జరిగిన ఈ సంఘటన వలన హిందూమతమునకు ఇతర మతముల ముందర తల ఎత్తుకోవలసి వస్తుందో, తలదించుకోవలసి వస్తుందో మీరే యోచించు కోండి!

ఇంతవరకు ఇదంతయూ వ్రాసిన మేము అందరు అనుకొన్నట్లు హిందూమతమునకు సంబంధించినవారమే.  పైకి మేము హిందూ మతములో ఉన్నప్పటికీ లోపలికి ఇందూపథములో ఉన్నవారమే.  మాకు తెలిసినట్లు మాది ఇందూపథమే అయినా  మీకు తెలిసినట్లు మాది హిందూమతమేనని చెప్పవచ్చును.  ఎవరేమనుకొనినా మాకు మతము ముఖ్యముకాదు పథమే ముఖ్యమైనది.  అందువలన ఏ మతములోని జ్ఞానమునైనా ఒప్పుకొంటాము, కానీ ఏ మతములోని కొద్ది అజ్ఞానమును కూడ ఒప్పుకోము.  దేవుడు సర్వమానవులకు సంబంధించినవాడు. అట్లే దేవుని జ్ఞానము అందరికీ సంబంధించినది.  అందరికీ సంబంధించిన జ్ఞానము ఏ మతములో ఉన్నా అది నీకు నాకు కూడా సంబంధించినదే అగును.  అందువలన దైవజ్ఞానమును ఏ మతమునుండైనా గ్రహించ వచ్చును.  అదే విధముగా దైవజ్ఞానమను పేరుతో మాయజ్ఞానము ఏ మతములో ఉన్నా దానిని పూర్తిగా ఖండించవచ్చును.  అజ్ఞానమును ఖండించవలసిన బాధ్యత అందరికి ఉన్నది.  ఈ సూత్రము ప్రకారము దైవజ్ఞానము ఇటు హిందూమతములో ఉండినా, అటు క్రైస్తవ మతములో ఉండినా  నేను దానిని తప్పక ప్రశంసిస్తాను.  అట్లే దైవజ్ఞానమునకు వ్యతిరేకమైన మాయజ్ఞానము  ఇటు హిందూమతములో ఉండినా, అటు క్రైస్తవ మతములో ఉండినా  నేను దానిని తప్పక ఖండిస్తాను.  ఇది మా నైజము.

ఆ నేపథ్యములోనున్న మాకు క్రైస్తవ మతములో దేవుని జ్ఞానమునకు వ్యతిరేఖమైన మాయజ్ఞానము కనిపించినది. అప్పుడు నా బాధ్యత ప్రకారము నేను మాయజ్ఞానమును ఖండించి, దేవుని జ్ఞానమును వివరముగా చెప్పవలసి వచ్చినది. నేను ఒక దినము హైదరాబాద్ పట్టణములో ప్రయాణించుచున్నపుడు కారు అద్దమును దించేదానికి ప్రక్కకు చూచాము. అపుడు అక్కడ ఒక కాంపౌండు గోడమీద పెద్ద పెద్ద అక్షరములతో వ్రాసియున్నది కనిపించినది. అక్కడ ఏమి వ్రాసియున్నదనగా! 'సృష్ఠికర్త కోడ్ 666' అని వ్రాసియున్నది. దానిని చూచిన మేము వెంటనే మా ప్రక్కనున్న వ్యక్తితో "ఎవరో ఇది తప్పుగా వ్రాసియున్నారు. దేవుని కోడ్ 963 అని ఉండవలయును. వారు వ్రాసినది మాయ నంబరు. మాయ నంబరును దేవుని నంబరుగా వ్రాయడము తప్పు" అన్నాము. మరికొంత దూరము వెళ్ళిన తర్వాత ఒకవాల్‌పోస్టర్ కనిపించినది. దానిమీద కూడ సృష్ఠికర్తకోడ్ 666 అని వ్రాసియుండి దాని ప్రక్కన యోహాన్ ప్రకటనల గ్రంథము 13-18 అని బ్రాకెట్‌లో వ్రాయబడియున్నది. అప్పుడు తెలిసినది ఇది బైబిలులోని వాక్యమని! తర్వాత ఇంటికివచ్చి బైబిలు తీసి యోహాన్ ప్రకటనలను భాగములో 13వ అధ్యాయమున 18వ వాక్యమును చదివాము. అక్కడ కూడా అది దేవుని నంబరుగా లేదు. వెంటనే యోహాన్ ప్రకటనల భాగములోని 22 అధ్యాయములన్నిటినీ చదివాము అపుడది సాతాన్ (మాయ) నంబరు అని స్పష్టముగా అర్థమైనది. దానితో వారు గోడలమీద వ్రాసినది పూర్తి తప్పు అని తెలిసిపోయినది. బైబిలులో ప్రకటనల గ్రంథము 13వ అధ్యాయము 18వ వాక్యము ఇలా కలదు. **"బుద్ధిగలవాడు మృగము యొక్క సంఖ్యను లెక్కింపనిమ్ము. అదియొక మనుష్యుని సంఖ్యయే. ఆ సంఖ్య ఆరువందల ఆరువది యారు, ఇందులో జ్ఞానము కలదు."** ఈ వాక్యము ప్రకారము అది దేవుని సంఖ్యకాదు అని తెలిసిపోతుంది. కానీ

మాయ నంబరుగా చెప్పిన ఆరువందల అరువది యారు ఏ విధానముతో ఆ సంఖ్యను చెప్పారనునది అక్కడగానీ, మొత్తము అన్ని అధ్యాయములు చదివినా కానీ ఎక్కడా వివరము లేదు. అపుడు ఆరువందల అరువది యారును దేవుని సంఖ్యగా ప్రకటించిన వారిని కలిస్తే ఆ సంఖ్య వివరమేమైనా తెలుస్తుందేమోనని అనుకొన్నాము. తర్వాత వారిని కూడా కలిసి మాట్లాడడము జరిగినది. వారిని కలిసి మాట్లాడిన వివరమంతా మేము వ్రాసిన **"సృష్టికర్త కోడ్ 963, మాయ కోడ్ 666"** అను గ్రంథములో పొందుపరిచాము. అక్కడ వారివద్ద సరియైన సమాధానము లేదని తెలిసిపోయినది. వారు 666 ను మాయ (సాతాన్) నంబరు అని ఒప్పుకుంటూనే దానిని దేవుని నంబరుగా చెప్పాలని ప్రయత్నించారు.

అపుడు ఆరువందల అరువది యారు మాయ నంబరని, అది దేవుని నంబరుకాదని వివరముగా చెప్పదలచిన మేము ప్రత్యేకమైన గ్రంథము వ్రాయవలసి వచ్చినది. ఆ గ్రంథములో దేవుని కోడ్ ఫలానా అని కూడా వివరించవలసి వచ్చినది. అ సందర్భములో మాయ మతగ్రంథములలో ఎలా చోటు చేసుకొన్నదో వివరించడములో బైబిలులోని ఒక ఘట్టమును తీసుకొని ఇది దేవుడు చెప్పినది కాదని చెప్పవలసివచ్చినది. బైబిలులోని ఆదికాండములోని మొదటి ఆధ్యాయము మొత్తము శాస్త్రబద్ధము కాదని, కల్పించి మనుషులు చెప్పినది తప్ప దేవుడు చెప్పినది కాదని చెప్పడమైనది. బైబిలు ఆదికాండములోని సృష్టి విధానమును మేము ఖండించడము వలన కొంతమంది క్రైస్తవ సోదరులకు కొంత బాధకల్గినా విజ్ఞానము కల్గిన క్రైస్తవులంతా మా మాటను సమర్థించారు. అక్కడ మా మాటను కాదనుటకు ఏ దారిలేదు, కావున ఆ విషయమును గురించి క్రైస్తవ సోదరులు ఏమీ మాట్లాడలేదు. మేము దేవుని జ్ఞానమును సమర్థిస్తూ, మాయ జ్ఞానమును విమర్శిస్తూ, గ్రంథము వ్రాసి దాదాపు పదివేల గ్రంథములను ఉచితముగా

పంచాము. ఇది మాయ జ్ఞానము, ఇది దేవుని జ్ఞానము అని తెలియుటకు 20వేల వాల్‌పోస్టర్స్‌ను రాష్ట్రమంతటా అంటించడము జరిగినది. అంతేకాక రాష్ట్రవ్యాప్తముగా గోడలమీద సృష్ఠికర్తకోడ్ 963, మాయకోడ్ 666 అని వ్రాయించాము. క్రైస్తవులు వ్రాసిన సృష్ఠికర్తకోడ్ 666 ప్రక్కనే సృష్ఠికర్తకోడ్ 963 అని హైదరాబాద్‌లో అనేక చోట్ల వ్రాయించాము. అలా వ్రాయుట వలన అందరి దృష్ఠి దానిమీద పడి దాని వివరము తెలుసుకొనే ప్రయత్నము చేస్తారని అనుకొన్నాము. మేము గోడలకు అతికించిన పేపర్లమీద దీని వివరముగల గ్రంథము ఫలానా చోట దొరుకునని అడ్రసు వ్రాయడము జరిగినది. సృష్ఠికర్త కోడ్ 963 అని వ్రాసిన చోట ఇది భగవద్గీతలోని జ్ఞానమని తెలియునట్లు భగవద్గీత అ.15, శ్లోకము 16,17 అనీ, మాయకోడ్ 666 వ్రాసిన చోట క్రిందనే భగవద్గీత అ.16, శ్లోకము14 అని కూడా వ్రాశాము. దానిని చూచిన వారికి ఇది భగవద్గీతలోని విషయమని సులభముగా అర్థముకాగలదు.

భగవద్గీతలో ఇంతగొప్ప రహస్యమున్నదని బయటికి ఏ హిందువు గానీ, ఏ హిందూసంస్థగానీ ప్రచారము చేయకున్నను మేము మొట్టమొదటి సారిగా రాష్ట్రవ్యాప్తముగా భగవద్గీత పేరును ప్రచారము చేశాము. అలా చేయుటకు మాకు దాదాపు ఐదులక్షల రూపాయలు అయిపోయినవి. దానికి హిందువులు ఎంతో సంతోషపడాలి. ఒకవేళ బాధకలిగితే క్రైస్తవులకు కలగాలి. అయినా ఇక్కడ మేమనుకున్నాదానికి తలక్రిందులుగా జరిగినది. ఒక విధముగా క్రైస్తవులే సంతోషించారు. ఈయనెవరో ధైర్యముగా సత్యమునే చెప్పాడని ఒప్పుకొన్నారు. బైబిలు ప్రకారము కూడా 666 మాయ నంబరేనని ఈ విషయము భగవద్గీతలో ముందే యుండడము సత్యమునకు బలము చేకూరినట్లేనని అనుకొన్నారు. కానీ హిందువులు మేము చేసిన పనిని చూచి చాలా బాధపడిపోయారు. గోడల మీద వ్రాతలలో భగవద్గీత

అని ఉన్నా, అధ్యాయముల సంఖ్య మరియు శ్లోకముల సంఖ్యయున్నా, అది గొప్పగా కనిపించక నీచముగా కనిపించింది. కర్నూలు జిల్లా మహానంది దగ్గర అతికించిన పోస్టర్స్‌ను గురించి అసభ్యకరమైన పోస్టర్లు అని సంబోధిస్తూ వార్తాపత్రికలలో న్యూస్ వ్రాయడము జరిగినది. ఆ పని చేసినది ఎవరోకాదు హిందూమతమును రక్షిస్తామని పరిషత్‌లుగా, సంఘములుగా ఏర్పడినవారే అలా చేశారు. అదే పరిషత్ వ్యక్తులు కొందరు మేము ఇచ్చిన అడ్రసును పట్టుకొని మా మీద పోలీస్‌స్టేషన్‌లో కేసు కూడా పెట్టడము జరిగినది. హంపి దగ్గరున్న అనేక దేవాలయములలో ఏదో ఒక ఆలయము యొక్క ప్రహరి (కాంపౌండు) గోడమీద వ్రాశారని వారి ఆరోపణ. ఇది ఏమి పెద్దతప్పు కాదని పోలీసులు చెప్పినప్పటికి, పోలీసులే ఆ వ్రాతను తుడిచివేసినప్పటికి వారి మాటను కూడా వినకుండా పట్టుపట్టి కేసు పెట్టించారు. ఆ విషయమును పోలీసులు మాకు తెలిపితే, మా వారు ఇద్దరు వ్యక్తులు బాగా జ్ఞానము తెలిసినవారు పోయి కోర్టుకు హాజరై, వారు అడిగితే వివరము చెప్పాలనుకున్నారు. కానీ అక్కడి న్యాయాధిపతి వివరము ఏమి అడగకుండానే ఇరవై రోజులు జైలుశిక్ష చెప్పాడు. దేవుని విషయములో ప్రాణమునైనా సులభముగా ఇవ్వడానికి సంసిద్ధముగా ఉన్న మావారు దేవుని విషయములో ఇది మాయ కలుగజేయు ఆటంకమని, మాకు ఏ బాధ లేదని సంతోషముగా జైలుకు పోయారు. మేము వ్రాసిన వ్రాతకు భగవద్గీత అని పేరు పెట్టడము వలన క్రైస్తవులకు బాధకల్గి అసూయతో మామీద కేసులు పెట్టారంటే వారు మతద్వేషముతో పెట్టారులే అని మనమనుకోవచ్చును. అలా కాకుండా భగవద్గీత అని పేరున్న వ్రాతను చూచి హిందువులే హిందువుల మీద కేసు పెట్టడము పెద్దవింతే అవుతుంది. అదియూ హిందూమతమును ఉద్ధరించాలను కొన్నవారే ఆ విధముగా చేయడము మరీ పెద్దవింతే అవుతుంది. ఇదంతయూ చూచిన

మేము ఈ వింతను గురించి మరియొక ప్రత్యేకమైన గ్రంథమును వ్రాయాలనుకొన్నాము. ఆ గ్రంథమే ఇపుడు మీరు చదువుచున్న ఈ గ్రంథము. క్రైస్తవులలోని అజ్ఞానమును ఖండించుటకు మేము కొన్ని లక్షలరూపాయలు ఖర్చుపెట్టి రాష్ట్రమంతా వ్రాయించడము, పేపర్లు అతికించడము చేసి **"సృష్టికర్త కోడ్ 963"** అను గ్రంథమునే విడుదల చేశాము. మేము చేసిన పనికి హిందువులు అజ్ఞానముగా ప్రవర్తించడమును చూచి వారిలోని అజ్ఞానము పోవుటకు, వారికి జ్ఞానము కల్గుటకు మీరు చదువుచున్న **"మతము-పథము"** అను గ్రంథమును వ్రాయవలసి వచ్చినది.

ఈ గ్రంథము ద్వారా హిందువులను మేము ప్రశ్నించునదేమంటే! భగవద్గీత అని పేరుపెట్టి వ్రాసిన వ్రాతలు అసభ్యకరముగా ఎలా కనిపించాయి? ఒకవేళ మీకు వాటిలో ఏదైనా లోపము కనిపించియుంటే అక్కడే మేమిచ్చిన అడ్రసులో మాతో సంప్రదించి తెలుసుకోవచ్చు కదా! అట్లుకాకుండ వార్తాపత్రికలలో దానిని వార్తగా అసభ్యమను పదమును ఉపయోగించి వ్రాయడము వలన భగవద్గీతను మీరు గౌరవించినట్లగునా? ఇది ప్రత్యేకించి మహానంది దగ్గరున్న వారినడిగే ప్రశ్నలనుకోండి. ఇక పోలీసుస్టేషన్‌లో కేసుపెట్టి శిక్షవేయించిన హంపి వారినడిగేదేమంటే. దేవాలయ కాంపౌండు గోడకు వ్రాయడము చట్టరీత్యా నేరమను ఉద్దేశ్యముతో మీరు కేసు పెట్టారు. ఇపుడు మేము చేసినది తప్పెలా అవుతుందని ప్రశ్నించవలసివచ్చినది. మేము దేవుని గుడి కాంపౌండు గోడమీద సిగరెట్ల ప్రచారము వ్రాసియుంటేనో లేక వ్యాపార ప్రకటనలు వ్రాసియుంటేనో తప్పగును. కానీ దేవుని గుడిమీద భగవద్గీత వాక్యము వ్రాయడము తప్పా? అని ప్రశ్నిస్తున్నాను. అది కూడా అక్కడున్న నియమములు తెలియక వ్రాయడము జరిగినదేకానీ తెలిసి బలవంతముగా వ్రాయలేదు. అక్కడ చేసినది సమాజమునకు మంచిని చేకూర్చునదా, చెడును చేకూర్చునదా

అని యోచించకనే దానిని తప్పుగా ఎలా భావించారు? ఒకవేళ చట్టరీత్యా ఇది తప్పేనని న్యాయస్థానము నిర్ణయిస్తే, దానికి వందో రెండువందలో జరిమానా విధించవచ్చును కానీ అదేదో పెద్దనేరమైనట్లు నాలుగువేల రూపాయలను జరిమానా విధించడము, డబ్బును కట్టలేకపోతే 20 రోజులు జైలుశిక్ష వేయడము సబబేనా? అని ప్రశ్నించుచున్నాము. అదే నేరమైతే అది అంత పెద్ద శిక్షార్హమైతే క్రైస్తవుల చర్చీల ప్రహారీ గోడల చుట్టూ ప్రభువే నిజమైన దేవుడని, ప్రభువు పాపులను రక్షించునని అనేకమైన బైబిలు వాక్యములు వ్రాసియుంటారే అది కూడా చట్టము ప్రకారము తప్పేకదా! ఒకవేళ క్రైస్తవుడే న్యాయాధిపతిగా యుండి దానిని తప్పని వ్రాసిన క్రైస్తవులకు జైలుశిక్ష విధిస్తే క్రైస్తవులు ఆ న్యాయాధిపతిని వారి మతమునుండే వెలివేస్తారు. గతకాలములో బర్నాలా అను సిక్కు ముఖ్యమంత్రిగా యున్నపుడు చట్టమని సిక్కులకు వ్యతిరేఖమైన పని చేస్తే సిక్కు గురువులు ముఖ్యమంత్రిగా యున్న బర్నాలాకు శిక్షవేసి వారి స్వర్ణదేవాలయము ముందర వచ్చిపోయే భక్తుల యొక్క చెప్పులకున్న దుమ్ము తుడిచేటట్లు చేశారు. ఇతర మతములలో పెద్ద జ్ఞానము లేకున్నా వారు ఎంతో క్రమశిక్షణతో దేవుని ఎడల ప్రవర్తిస్తుంటే హిందువులెందుకు ఇలా దిగజారిపోతున్నారు? ఎలక్షన్ సమయములో కనపడిన గోడల మీదంతటా వ్రాసే నాయకుల మీద కేసులు పెట్టలేని మీరు భగవద్గీత వాక్యమును తప్పుగా భావించి కేసులు పెట్టడము, ఆ వ్రాతను అసభ్యకరమైనవని న్యూస్‌పేపర్లకు ఎక్కించడము మంచిదేనా? హిందూమతమును రక్షించే మీరే యోచించుకోండి.

మేము చేసిన ప్రచారము హిందువులు చెడుగా గుర్తించారని, శిక్షలు వేయించారని తెలుసుకొన్న ఇతర మతములలో ఒక మతమువారు మావద్దకు వచ్చి “మీ మతములో జ్ఞానము లేదని ఇప్పటికైనా ఒప్పుకుంటారా” అని

మమ్ములను అడుగుచున్నారు. ఎంతో జ్ఞానమున్న మీరు మా మతములోనికి రండి మిమ్ములను మేము ఎంతో గౌరవిస్తాము. మీ మాట వినేవారు, మీ సంఘములోని వారు దాదాపు పదివేలమంది యున్నారు కదా! మీరందరు మా మతములోనికి వస్తే మిమ్ములను చాలాగొప్పగా పెట్టుకొంటాము. మీ మతములో లేని గౌరవము గుర్తింపు మేము మా మతములో ఇస్తామంటున్నారు. మరియొక మతము వారు వచ్చి మా మతములో దేవునికిగానీ దేవుడు చెప్పిన మాటలనుగానీ ఎవరైనా అగౌరవముగా మాట్లాడితే వాడు ప్రధానమంత్రి అయినా వదలక చంపి తీరుతామనీ, దేవునికి వ్యతిరేఖమైన చిన్న సమస్యకు కూడా మా మతములోని వారంత ఏకతాటి మీదకు వస్తారనీ, దేవుని మీద ఎక్కువ విశ్వాసమున్న మా మతములో మీరు చేరండని పిలుస్తున్నారు.

వారు మా మీద అభిమానముతో అలా పిలువడము సంతోషమే. కానీ మాకు మతము ముఖ్యము కాదు. పథము ముఖ్యము కావున ఎవరి మాటను నేను వినదలచుకోలేదు. మతము మధ్యలో వచ్చినదని దానికి ప్రాధాన్యత ఇవ్వలేదు. ఒకవేళ హిందువులు మాపట్ల వ్యవహరించిన తీరుకు, మేము ఇతర మతములో చేరుటకు అంగీకరించియుంటే నాతోపాటు పదివేలమంది నన్ను అనుసరించి ఇతర మతములోనికి వచ్చేవారుకదా! అపుడు హిందూమతము హిందూరక్షణ సంస్థలచేత రక్షించబడినదా? భక్షించబడినదా? చదువుచున్న మీరే యోచించి చెప్పండి. హిందువులు మా మతము క్షీణించిపోతున్నది, దానిని రక్షించుకోవాలని గుంపులుగా సంస్థలుగా ఏర్పడడము మంచిదేకానీ వారిలో దైవజ్ఞానము లేకపోవడము వలన దేనినైతే రక్షించాలనుకొన్నారో దానినే భక్షించినట్లయినది. దేవుని గుడి మీద దేవుని వాక్యముండడము మంచిదేనని హిందూపరిషత్ వారు అనుకోకుండా పోవడము మతభక్షణ కాక, మత రక్షణ ఎలా అవుతుంది?

ముద్దాయిలు దొరకలేదని ఎన్నో కేసులను పెండింగులో పెట్టు పోలీసులు మావారిని కోర్టుకు తీసుకపోవడము వలన ఇది మా మతమని మేము చెప్పుకోవడానికి కూడా మాకు సిగ్గుగాయున్నది. ఒక కేసును ఎంతో విచారణ జరిపి తొమ్మిదిమంది సాక్షులు సాక్షము చెప్పినప్పటికీ పదవసాక్షి కొంత సరిగా చెప్పలేదను చిన్నసాకుతో, కేసును కొట్టివేయు న్యాయాధిపతులు విచారణ జరుపకుండా, ముద్దాయిలుగా నిలబెట్టిన వారి సమాధానమేమో చూడకుండా, పెద్దకేసుకు శిక్ష చెప్పినట్లు చెప్పడము ఇతర మతముల ముందర హిందూమతము తలదించుకొనే పనికాదా! దీనినంతటినీ చూస్తే హిందూమతము క్షీణించిపోక అభివృద్ధి ఎలా అవుతుంది?

ఏ మతములోనైనా దేవునిజ్ఞానము, దేవుని మీద విశ్వాసము లేకపోతే అది క్షీణించక అభివృద్ధి కాదు. నేడు దేవుని జ్ఞానముగానీ, దేవుని మీద విశ్వాసముగానీ హిందూమతములో లేకుండా పోయినది. అందువలన హిందూమతము క్షీణదశలో ఉండి క్రైస్తవ, ఇస్లామ్ మతములు అభివృద్ధి చెందుచున్నవి. హిందూమతము అభివృద్ధి చెందాలంటే మా సలహా ఏమనగా! **'మతము'** అను పదము, **'పథము'** అను పదముగా మార్చుకోవాలి. అట్లే **'హిందూ'** అను పదమును **'ఇందూ'** అను పదముగా మార్చుకోవాలి. దేవునికి దగ్గరగా పోవాలంటే ఏ మతమైనా మతము అను మాటను వదిలి పథము అను మాటగా మార్చుకోవాలి. అపుడు మాయలేని స్వచ్ఛమైన జ్ఞానము అందరిలోను నిలువగలదు. మేము చెప్పునది దేవుని జ్ఞానమార్గము కావున అసూయలేకుండ స్వాములు సహితము ఈ విషయాన్ని అవగాహన చేసుకుంటారని తలచుచున్నాము. మేము మతములో లేము పథములో ఉన్నామని అందరూ పథమును అనుసరించాలి.

**మతమును నిర్వీర్యము చేస్తూ పథమును బలపరుస్తూ మేము వ్రాసిన కొన్ని వాక్యములను క్రింద పొందుపరుస్తున్నాము.**

1. మత వైషమ్యాల మాయలోబడక మహోన్నత భావాన్నిమలచుకో! ఆత్మశిఖరాన్నధిరోహించగలవు.
2. దేవుడు మతాలను, కులాలను సృష్ఠించలేదు.
3. మతాలను బట్టి అనేక విధానములుగా, అనేక పేర్లుగా, వేరువేరుగా పిలువబడువాడు ఒక్క దేవుడే.
4. మాయ (సైతాన్) లేక సాతాన్ మానవున్ని మతాలపేరుతో మభ్యపెట్టుచున్నది.
5. మతము దేవున్ని తెలుపలేదు. జ్ఞానమే దేవున్ని తెలుపును.
6. దైవము ఒకమతమునకు సంబంధించినవాడు కాదు.
7. మతము చాటున దేవున్ని ఊహించుకొని, మతమునకు దేవున్ని పరిమితి చేసి మాట్లాడడము అజ్ఞానమే అగును. అన్నిమతములకు అధిపతి ఒకే దేవుడని తెలియడమే జ్ఞానమగును.
8. పుట్టిన తర్వాత కొంతకాలమునకు తెలియునట్టి కులము, మతము మనుషులు కల్పించుకొన్నవే కానీ జన్మతః వచ్చినవి కావు.
9. కులాలు కుచ్చితముతో, మతాలు స్వార్థముతో కూడుకొన్నవి. కులాలకు మతాలకు దేవుడు అతీతముగ ఉన్నాడని తెలిసి నీవు ఆ విధముగ మారినపుడే దేవుడు తెలియును.
10. ఏ మతమునకు చెందిన మనిషిలోనైన ముక్కురంధ్రములలో కదలే శ్వాసలో “ఓమ్” శబ్దము ఇమిడి ఉన్నది.
11. “ఓమ్” ఒక మతమునకు సంబంధించినది కాదు. మనుషులందరికి, జీవరాసులందరికి సంబంధించినది.

12. నాది అనుకొను నీ మతమేదో నీకు నిజముగ తెలుసునా? మధ్యలో ఏమైనా మారిందేమో?

13. నీకు తెలియకుండానే ఎప్పటికీ మారని మతములో, ఎప్పటికీ మారని కులములో నీవున్నావు.

14. నీవు ఎప్పటికీ మారని జీవకులములో ఉన్నావు. అలాగే ఎప్పటికి మారని దైవమతములో ఉన్నావు.

15. పరమతమును గురించి మాట్లాడాలనుకుంటే ముందు నీ మతమును గురించి నీవు యోచించు. పరమతములోని లోపమేమిటో? నీ మతములోని గొప్పతనమేమిటో? న్యాయముగా, నీతిగా నిర్ణయించుకో!

16. పరమతమును గూర్చి గానీ, నీ మతమును గూర్చి గానీ, స్వార్థబుద్ధితోగానీ, రాజకీయముగా గానీ, సమాజపరముగా గానీ యోచించవద్దు.

17. ఒకవేళ నీ మతము గొప్పగా, పరమతము నీచముగా కనిపిస్తే, మతమును గురించి వదలివేసి, మతము యొక్క ప్రసక్తి లేకుండా కేవలము దేవున్ని గురించే బోధించు, దేవుడు అన్ని మతములకు పెద్ద కావున ఏ మతస్థుడైనా నీ మాట వినగలడు.

18. ఒకవేళ పరమతము గొప్పగా, నీ మతము నీచముగా కనిపిస్తే, నీవు మతమును మాత్రము మారవద్దు. నిన్ను ఈ మతములోనే దేవుడు ఎందుకు పుట్టించాడో యోచించు. అపుడు మత చింతపోయి దైవ చింత కల్గుతుంది.

19. మతము అన్న పేరు ప్రతి వర్గములోను ఉన్నది. నీది ఒక పేరు కల్గిన మతమైతే, మరొకనిది ఇంకొక పేరు కల్గిన మతమై

యుండును. మతములో నిన్ను దేవుడే పుట్టించాడు. కానీ నీవు కోరి ఏ మతములో పుట్టలేదు.

20. నిన్ను ఒక మతములో పుట్టించి, ఇంకొకనిని మరొక మతములో దేవుడే పుట్టించాడు. అలా నిన్నూ ఇంకొకన్నీ పుట్టించినది ఒకే దేవుడే! నీవు పుట్టిన తర్వాత దేవునికి నీవే పేర్లు పెట్టుచున్నావు. నిజముగా దేవునికి పేరులేదు, ఆకారము అంతకూలేదు.

21. మతాలకు అతీతముగా, పేర్లకు అతీతముగా, రూపములకు అతీతముగా, క్రియలకు అతీతముగా ఎవడైతే ఉన్నాడో వాడే నిజమైన దేవుడు. అతనే నిన్ను ఈ ప్రపంచమును సృష్టించినవాడు.

22. దేవుడు మనిషిని మాయలో పుట్టించి తర్వాత తనవద్దకు వస్తాడో రాడో, తనను గుర్తిస్తాడో లేదో చూడాలనుకొన్నాడు. ఆ ప్రక్రియలో మొదటిదే నిన్ను ఒక మతములో పుట్టించడము. బాగా చూచుకొంటే నీవు ప్రస్తుతము మాయలో ఉన్నావు, దేవుని వైపుపో!

23. నీకు ఒక పేరునూ, నీకు ఒక కులమునూ, అలాగే ఒక మతమునూ ఇతరులే నీకు మొదట కరిపించారు. దేవునికి పేరుందా? కులముందా? మతముందా? అవి ఏవీ లేవు. అవి లేని వానిని తెలుసుకోవాలంటే నీవు నీ పేరునూ, కులమునూ, మతమునూ దేవుని విషయములో దూరముగా పెట్టుకో.

24. నీవు ఏ మతాన్ని సమర్థించవద్దు. దేవున్ని, దేవుని జ్ఞానాన్ని మాత్రము సమర్థించు.

25. నీ ఇష్టముతో కూడుకొన్నది మతము. దేవుని ఇష్టముతో కూడుకొన్నది జ్ఞానము.

26. మతమును మనిషి సృష్టించాడు. జ్ఞానమును దేవుడు సృష్టించాడు.

27. మనిషి సృష్టించిన మతము ఇహమునకు సంబంధించినది. దేవుడు సృష్టించిన జ్ఞానము పరమునకు సంబంధించినది.
28. మనిషి సృష్టించిన మతమును పట్టుకొని ఇహములో ఉంటావో, దేవుడు సృష్టించిన జ్ఞానమును పట్టుకొని పరమునకు పోతావో నీవే నిర్ణయించుకో.
29. మతము మనుషుల గుంపును పెంచుతుంది. జ్ఞానము కేవలము జ్ఞానుల గుంపును పెంచుతుంది.
30. మతాన్ని ఏ మనిషిలోనైనా చూడవచ్చును. జ్ఞానాన్ని కొందరిలోనే చూడవచ్చును.
31. ప్రతి మనిషి మతానికి సంబంధించినవాడే. కానీ ప్రతి మనిషి జ్ఞానానికి సంబంధించి ఉండడు.
32. మతాన్ని బోధించేవారు మతగురువులు ఎందరో! జ్ఞానాన్ని బోధించేవాడు జ్ఞానగురువు ఒక్కడే!!
33. మతము మనిషి పుట్టుకతోనే ఉంటుంది. ఇది నా మతము అని అందరికీ తెలుసు. కానీ దైవజ్ఞానము పుట్టుకతో ఉండదు. మధ్యలో జ్ఞానము తెలిసినా అది అందరికి నచ్చదు.
34. మతము అంటే మార్గము కానిదని అనుభవముతోనే తెలుస్తుంది.
35. పథము అంటే మార్గము అయినదని అర్థములోనే తెలుస్తుంది.
36. ఒక మతములోని అజ్ఞాని కూడా ఇది నా మతము అని చెప్పగలుగు చున్నాడు. అందువలన మతములో అందరూ జ్ఞానులుంటారను నమ్మకము లేదు.
37. అజ్ఞానులు సహితమున్న మతము కావాలో కేవలము జ్ఞానులున్న పథము కావాలో నీవే యోచించుకో.

38. ఏ మతములోని అజ్ఞానమునైనా ఖండించు, ఏ మతములోని జ్ఞానమునైనా స్వీకరించు.

39. నీవు నాది హిందూమతమని అనుకుంటే ఇతర మతములోని జ్ఞానాన్ని కూడా ద్వేషిస్తావు. నాది ఇందూపథమని అనుకుంటే ఇతర మతము లోని అజ్ఞానాన్ని మాత్రమే ద్వేషించి జ్ఞానాన్ని ప్రశంసిస్తావు.

40. హిందూమతము పేరుతో రాజకీయమును చేయువారికి దూరముగా ఉండు. ఇందూపథము పేరుతో రాజయోగము చెప్పువారికి దగ్గరగా ఉండు.

41. మనిషిని ద్వేషించవచ్చు, మతాన్ని ద్వేషించవచ్చు, దానివలన వచ్చే పాపము క్షమించబడుతుంది.

42. దేవున్నికానీ, దేవుని పథమునుగానీ ద్వేషిస్తే దానివలన వచ్చే పాపము యుగ యుగముల పర్యంతము క్షమించబడదు.

43. నీవు జడ్జివైతే నీకు చట్టము తెలుసు, కావున ప్రపంచ విషయములకు శిక్ష చెప్పవచ్చును. దేవుని విషయములకు శిక్ష చెప్పవద్దు. ఎందుకనగా దేవుని చట్టము నీకు తెలియదు.

44. నీవు న్యాయనిర్ణేతవైన జడ్జివైతే ప్రపంచ విషయములలో ఇది ఫలనా నేరమని గుర్తించగలవు. కానీ దేవుని విషయములలో ఇది ఫలనా నేరమని గుర్తించలేవు.

45. నీవు న్యాయ నిర్ణేతవైతే న్యాయాన్యాయములను మాత్రమే గుర్తించగలవు. కానీ ధర్మాధర్మములను గుర్తించలేవు.

46. నీవు జడ్జివైతే కేవలము న్యాయాధికారివే, కానీ ధర్మాధికారివి కాదని గుర్తుంచుకో!

47. నీవు జడ్జివైతే ఇహలోక సంబంధ న్యాయమును మాత్రము గుర్తించ గలవు. కానీ పరలోక సంబంధ ధర్మమును గుర్తించలేవు.

48. న్యాయశాస్త్రమును చదివితే నీవు జడ్జి కావచ్చును. కానీ యోగ శాస్త్రమును చదవనిదే ఎవరూ యోగి కాలేరు.

49. న్యాయాధిపతి అయిన జడ్జి మనుషులకు మాత్రము శిక్ష చెప్పగలడు. కానీ ధర్మాధిపతి అయిన దేవుడు న్యాయాధిపతులకు కూడా శిక్ష చెప్పగలడు.

50. స్వచ్ఛమైన తెల్లనిది జ్ఞానము. చిక్కనైన నల్లనిది అజ్ఞానము. తెల్లని దుస్తుల మీద పూర్తిగా నల్లని కోటును ధరించిన జడ్జి నేను జ్ఞానానికి జడ్జిని కాదు, అజ్ఞానానికి మాత్రమే అన్నట్లున్నది.

51. తెల్లని దుస్తులమీద నల్లని చిన్న కోటును ధరించిన న్యాయవాదులైన లాయర్లుకానీ, నల్లని పెద్దకోటు ధరించిన న్యాయనిర్ణేతలైన జడ్జీలు కానీ, చట్టములో జ్ఞానమును, అజ్ఞానము కప్పియున్నదని ఇతరులకు తెలియునట్లు, ఆ విధముగా తెలుపు మీద నలుపును ధరించారనుకొంటాము.

52. మాయకు రెండు బలమైన వలలు కలవు. ఆ వలలలో చేపలు పడవు మనుషులు మాత్రము పడుతారు. ఆ వలల పేర్లు ఒకటి మతము. రెండు కులము. మతము కల్గినవాడు, కులము కల్గినవాడు మాయ వలలోనివారే. మతాతీతుడు, కులాతీతుడు దేవుని వలయములోని వారే.

53. మతము లేనివాడు దేవుని పథములోని వాడే! కులము లేనివాడు జ్ఞానపథములోని వాడే!



# రచయిత చివరిమాట

మతమను మాటయే సరియైనది కాదు. మతమనునది మాయ మిళితమైనది కావున దానిలో స్వమత అభిమానము పరమత ద్వేషము ఉంటాయి. ఎందరో అమాయక ప్రజలు మత ద్వేషముల వలన ప్రాణాలు కోల్పోతున్నారు. మతమే ఎంతో నష్టము కల్గించునదైయుంటే, దానికి రాజకీయరంగు పులుముకొంటే మరీ ప్రమాదముగా తయారగు అవకాశము కలదు. హిందూదేశముగ పేరుగాంచిన భారతదేశములో మతమును వాడుకోవడము వారికలవాటై పోయినది. అటువంటి వారికి దేవుని జ్ఞానము యొక్క వాసన కూడా తెలియదు. జ్ఞానము యొక్క రుచిగానీ, వాసనగానీ తెలియనివారే జ్ఞానమును ప్రచారము చేయు మమ్ములను ఇబ్బంది పెట్టి, దాని ద్వారా వారు ప్రచారము కావాలనుకొంటున్నారు. మేము ఎవరిని ఇబ్బంది పెట్టుచున్నామని వారు ఏమాత్రము ఆలోచించడము లేదు. హిందూ మతములో ఎవరూ చేయని ప్రచారము మేము చేస్తూ ఎనభై ఎనిమిది గ్రంథములను ప్రచురించాము. అజ్ఞానములోనున్న క్రైస్థవులకు కూడా వారి మతములోనే ఇది సరియైన మార్గమని చెప్పాము. **'ఇందూ జ్ఞానవేదిక'** అను సంస్థను స్థాపించి దాని ద్వారా ఎంతో దైవజ్ఞానమును ప్రచారము చేయుచున్నాము. ఎంతో జ్ఞానమును ప్రచారము చేయుచున్న మమ్ములను వ్యతిరేఖించడము ఎవరికీ మంచిది కాదు. మాలో ఏమైనా తప్పులుంటే, మేమేమైనా హిందూమతమునకు గానీ, ఇతర మతమునకుగానీ వ్యతిరేఖముగా ఉంటే మమ్ములను బహిరంగముగా నిలదీసి అడుగవచ్చును. దానికి సమాధానము చెప్పుటకు సిద్ధముగా ఉంటాము. అట్లుకాకుండా మామీద ధర్మవరము, బత్తలపల్లిలో చేసినట్లు ధర్నాలు చేయడము, హంపిలో మాదిరి కేసులు పెట్టడము, మహానందిలో మాదిరి పేపర్లలో వేయడము వలన మాకు ఎటువంటి నష్టము రాదు. కానీ మీరు మాత్రము దేవుని భక్తులైన గొప్ప గ్రహముల కోపమునకు గురికాగలరు! దానివలన మీకే కష్టము రాగలదు!! అందువలన మమ్ములను విమర్శిస్తే ఇటు జ్ఞానపరముగా గానీ, అటు న్యాయపరముగా గానీ విమర్శించండి. అట్లుకాక అన్యాయముగా, అజ్ఞానముగా విమర్శించడము దేవునికి కూడా సరిపోదని తెలుపుచున్నాము.



# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!

## భగవద్గీతయే చదవనివాడు హిందూ రక్షకుడా?

## హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి, బలహీనపరచి హిందూసమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని, అన్ని కార్యములు చేసుకోవాలనీ ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగా యున్న హిందూ సమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమనీ ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డురాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటివారు హిందూ సమాజమునకు చీడ పురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక వారు చెప్పినట్లే వినుట వలన, హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి, ప్రజలకు ఏమాత్రము దైవజ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు **త్రైత సిద్ధాంతకర్తగా ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు** అజ్ఞాన దిశవైపు నిలిచి పోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన **క్షర, అక్షర, పురుషోత్తమ** అను ముగ్గురు పురుషుల విషయమును **త్రైత సిద్ధాంతము** అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది. దానివలన నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు. అగ్రకులముగానున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియని జ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోషపడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞాన విషయములను చూచి ఈ జ్ఞానము వలన ప్రజలు జ్ఞానములో చైతన్యులై, జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్థవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదని ప్రచారము చేయను మొదలుపెట్టారు. అంతేకాక తాము హిందూధర్మరక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారమునకు అక్కడక్కడ అడ్డుపడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానంద యోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్థవుల జ్ఞానమని హిందువుల ముసుగులో క్రైస్థవ మత ప్రచారము చేయుచున్నారని చెప్పడమేకాక, అటువంటివారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరులు నెలకొల్పిన హిందూ (ఇందూ) జ్ఞాన వేదిక ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి, మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరు చూడండి.

**మా ప్రశ్న :-** ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలు ఉన్నారు. వారు ఎవరూ ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్తవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లూ తిరిగి క్రైస్తవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :-** మేము క్రైస్తవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది త్రైత సిద్ధాంత భగవద్గీత. అది క్రైస్తవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :-** క్రైస్తవులు తమను క్రైస్తవులుగానే చెప్పుకుంటారు. అలాగే బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్తవము, బైబిలు అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతమువారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ

ఇతర మతముపేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యము లున్నాయా?

**వారి జవాబు :-** త్రైతసిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :-** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు త్రైతసిద్ధాంతమును ప్రతిపాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువులని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :-** మీ త్రైతసిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :-** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? ప్రపంచమునకంతటికీ ఒకే భగవద్గీతయుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదని చదివిన జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించు చూయుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని

చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన ఒక్క హిందూ ధర్మమును చెప్పండి.

**వారి జవాబు :-** అవన్నీ మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :-** మొండిగా మాట్లాడవద్దండి మీరు అగ్రకులమువారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :-** కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా? యోగీశ్వరుల వారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండ మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూ మతములో దేవుడు ఒక్కడే అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :-** మేము మతమును గురించి చెప్పలేదు. హిందూ మతములో

ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము విశ్వమునకంతటికి ఒకే దేవుడని చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, సృష్టికర్తయనీ అనేకమార్లు పేర్కొన్నారు. దేవుడు అను పదమునుగానీ, సృష్టికర్తయను పదమునుగానీ క్రైస్తవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్తవులు అంటున్నాము.

**మా ప్రశ్న :-** క్రైస్తవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్టి పుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది నుండి 'సృష్టికర్త' అను పదమును 'దేవుడు' అను పదమును హిందూ సమాజము వాడుతూనే యున్నది. మొదటినుండి హిందూసమాజములో యున్న దేవుడు, సృష్టికర్త అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్టికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకోలేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి ఇందూ మతము అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలో గానీ ప్రత్యేకించి ఇందువులు అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :-** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. హిందువు, ఇందువు అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగు భాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుతకాలములో నరశింహులు అని పేరున్నవాడు కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని **నరసింహ** అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును **సింహము** అని అంటాము తప్ప **శింహము** అని అనము అనికూడ చెప్పుచున్నాము. 'సింహము' అంటే అర్థమున్నది గానీ, 'శింహము' అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే 'ఇందువు' అనే దానికి అర్థమున్నదిగానీ 'హిందువు' అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి 'దృష్ఠి, జిష్ఠి' అయినట్లు 'ఇందూ' అను శబ్దము 'హిందూ' అని పలుకబడుచున్నదని చెప్పాము. ఇందూ పదము ఎందుకు వాడాలి, హిందూ పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న సత్యము మీకు తెలిసినా, మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించు చుండగా, కొందరు మాత్రము వీధి రౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించిన వారికి ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను

ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలో శ్రీకృష్ణుని గుడికయినా ఇవ్వవలెను. ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగుచున్నాము.

ఇట్లు

**ఇందూ జ్ఞానవేదిక**



# చరిత్రలో జరిగిన అన్యాయము

# హిందువులలో జరుగుచున్న యదార్థము

నాలుగువందల సంవత్సరముల క్రిందట ఆధ్యాత్మిక రంగములో మెరిసిన వజ్రము **వేమనయోగి.** ఆధ్యాత్మికమను పాలను చిలికి దైవజ్ఞానము అనే వెన్నను తీసి ఇచ్చినవాడు వేమన. వేమన తన పద్యములలో చెప్పిన ఒక్కొక్క జ్ఞాన విషయము విపులముగా వ్రాసుకొంటే ఒక్కొక్క గ్రంథము కాగలదు. వేమన స్వచ్ఛమైన తెలుగు భాషలో పద్యమును వ్రాసి చెప్పాడు. సంస్కృతము జోలికి పోలేదు. ఒక ప్రక్క పద్యములు వ్రాసి కవిగా కనిపించినా, ఒక ప్రక్క అంతు తెలియని ఆధ్యాత్మికవేత్త వేమనయోగి. అయితే ఆయన పుట్టినది రెడ్డి కులమున. చరిత్రలో మాకంటే ఎవరూ పెద్దగా ప్రశంసింప బడకూడదని గర్వములో యున్న అగ్రకులములోని కొందరు పనిగట్టుకొని వేమన యోగిని పిచ్చివానిగా జమకట్టి, అతను చెప్పింది జ్ఞానమేకాదని ప్రజలలో ప్రచారము చేశారు. పిచ్చివాని మాటలు పిచ్చివారే వింటారు అని హేళనగా మాట్లాడడము జరిగినది. అనేక కులములుగాయున్న హిందువులకు జ్ఞాన

విషయములో పరిచయము లేనిదానివలన, అగ్రకులము వారు వేమన చెప్పినది జ్ఞానమే కాదనడము వలన, వేమన తన జ్ఞానమునకు తగినట్లుగా ప్రకాశింప లేకపోయాడు. తాము అగ్రకులము వారమనీ, మిగతా వారందరూ తగ్గ కులమువారనీ విభజించి, తాము చెప్పినట్లు వినవలెననీ, అట్లు వింటేనే మిగతా కులముల వారందరూ సుఖముగా బ్రతుకగలరనీ, అగ్రకులమువారు ప్రచారము చేసుకొన్నారు. అలా తమను తాము గొప్పగా ప్రకటించుకోవడమేకాక హిందువుల ఇళ్ళలో జరుగు ప్రతి మంచి పనికీ, చెడు పనికీ, చావుకూ పుట్టుకకూ, పెళ్ళికీ పేరంటానికీ ప్రతి కార్యమునకూ తాము చెప్పునట్లు చేయాలనీ, తాము నిర్ణయించు కాలములోనే చేయాలనీ, అట్లు చేయకపోతే నష్టము, కష్టము కలుగుతుందని భయపెట్టడము వలన, భయముతో జ్ఞానము తెలియని మిగతా కులముల వారందరూ వారు చెప్పిన దానిని నమ్మడము జరిగినది. ఈ విధముగా హిందూమతములో అగ్రకులము వారు భయము అను బ్లాక్‌మెయిల్ చేసి, తగ్గ కులము వారందరినీ తమమాట వినునట్లు చేసుకొన్నారు. ఆనాటి నుండి హిందూ సమాజమును మోసము చేస్తూ ఎవరికీ హిందూ జ్ఞానమును తెలియకుండా చేసి, తాము హిందూ సమాజమును అనేక పేర్లతో దోచుకొంటూ బ్రతకడమే కాక, మిగతా కులములలో ఎవరు జ్ఞానులుగా పుట్టినా, వారిని హేళన చేయడమూ, అజ్ఞానిగా వర్ణించడమూ జరిగినది.

చరిత్రలో నాలుగు వందల సంవత్సరముల క్రితము వచ్చిన వేమనను పిచ్చివానిగా వర్ణించి, శాస్త్రము తెలియనివాడని వర్ణించారు. తర్వాత మూడు వందలయాభై సంవత్సరముల క్రిందట వచ్చిన **'పోతులూరు వీరబ్రహ్మము'**గారు గొప్ప జ్ఞానిగా తయారై, భవిష్యత్తు కాలములో జరుగు సంఘటనలను ముందే తెలియజేసి గొప్ప కాలజ్ఞానమునే వ్రాశాడు. ఆయన వ్రాసిన భవిష్యత్తు కాలక్రమమున నేటికినీ జరుగుచూనేయున్నది. అంతటి గొప్ప జ్ఞాని అయిన వీరబ్రహ్మముగారు అగ్రకులమువాడు కాకపోవుట వలన, విశ్వకర్మ (ఆచారుల)

కులమున పుట్టుట వలన, అగ్రకులము వారు బ్రహ్మము గారు బ్రతికియున్న కాలములోనే, తమ ఊరిలోనికి రాకుండా, ఆయన జ్ఞానమును ప్రచారము చేయకుండా అడ్డుకొన్నారు. ఆ రోజు ఇతరులు జ్ఞానులు కాకూడదను అసూయ అను గుణముతోనూ, మేమే తెలిసిన వారమను గర్వముతోనూ ఆ పని చేశారు. హిందూ సమాజములో ఇటువంటి వారుండుట వలన విసిగి పోయిన హిందువులు హిందూ మతమును వీడి ఇతర మతములోనికి పోవుచున్నారు. ఇందూమతములో దేవునికి గుడికి అంటరాని వారిగా ఉండలేని వారందరూ కొందరు జ్ఞానము కొరకు, కొందరు కులవివక్ష లేని స్వతంత్రము కొరకు మతమును మారజొచ్చారు. ఈ విధముగా హిందూమతములోని వారు ఇతర మతములోనికి పోవుటకు మొదటి కారకులు హిందూమతములోని అగ్రకులములవారేనని అనుమానము లేకుండా చెప్పవచ్చును.

తమ వలననే హిందువులు ఇతర మతములలోనికి పోవుచున్నారని అగ్రకులమువారికి కూడా తెలుసు. అయితే తమ తప్పును ఎవరూ గుర్తించనట్లు తాము హిందూమతమును ఉద్ధరించువారిగా, హిందూధర్మ రక్షకులుగా వర్ణించుకొని హిందూ ధర్మ భక్షకులుగా నేటికినీ సమాజములో కొనసాగు చున్నారు. వారిని హిందూ ధర్మ భక్షకులు, హిందూ ధర్మ నాశకులు అని చెప్పుటకు అనేక ఆధారములు గలవు. అటువంటి వాటిని పరిశీలించితే, హిందువులలోని మిగతా కులము వారివద్ద భగవద్గీతను బోధించు కృష్ణుడు అర్జునుడు యున్న చిత్రపటము (ఫోటో) యుంటే దానిని ఇంటిలో ఉంచుకోకూడదనీ, ఆ పటము ఇంటిలో ఉంటే ఇంటిలో కూడా యుద్ధాలు వస్తాయనీ, అనేక కష్టాలు వచ్చి పాండవులు అరణ్యవాసము పోయినట్లు బాధపడవలసివస్తుందనీ అగ్రకులమువారు నేటికినీ చెప్పుచునే యున్నారు. అటువంటి భగవద్గీత ఫోటోలను గుడులలో ఉంచవలెననీ లేకపోతే ఏటిలోని నదీ ప్రవాహములో పారవేయాలనీ చెప్పడము, చేయించడము కూడా జరిగినది. అంతేకాక భగవద్గీతను ఇంటిలో ఉంచుకోకూడదని భగవద్గీతను ఎవరూ

చదువకూడదనీ, చదివితే కష్టాలు వస్తాయనీ, భగవద్గీతను ఎవరి ఇంటిలోనూ లేకుండునట్లు చేయుచున్నారు. భగవద్గీత అర్జునునికి యుద్ధ రంగములో యుద్ధము చేయుటకు చెప్పినది, అందువలన చదువకూడదు, చదివితే చదివినవారు కూడా అనేక తగాదాలలోనూ, కోర్టు వ్యవహారముల లోనూ చిక్కుకోవలసి వస్తుందని చెప్పడము జరుగుచున్నది. ఇంకనూ హిందువులకు వేదములు ముఖ్యమైనవనీ, వాటిని అన్ని కులముల వారు చదువకూడదనీ, వేదములను తామే చదువవలెననీ చెప్పడము కూడా జరుగుచున్నది. ఈ విధముగా భగవద్గీతకు వ్యతిరేఖముగా మాట్లాడువారు హిందూ సమాజమునకు చీడపురుగులుకాక ఏమవుతారో మీరే ఆలోచించండి.

ఇదంతయూ గతములో జరిగిన విషయములు, అవి చాలక ప్రస్తుత కాలములో వీరి ఓర్వలేనితనము, మేమే పెద్ద అను గర్వము ఎలాగుందో చూడండి. వేమనయోగిని, పోతులూరి వీరబ్రహ్మముగారిని అగ్రకులము వారు ఎంత హేళన చేసినా, వేమనయోగిని రెడ్డి కులస్థులు వేమారెడ్లుగా గుఱ్ఱముల నెక్కి ప్రచారము చేయుట వలన, వీరబ్రహ్మముగారిని విశ్వకర్మ (ఆచారి) కులమువారు కాలజ్ఞానమును ప్రచారము చేయుట వలన, వేమన సంఘములు, విశ్వకర్మ సంఘములు తయారై వేమనను, బ్రహ్మముగారిని ప్రచారము చేయుట వలన, కొంతమంది ప్రజలకు వేమనయోగి పద్యములు, వీరబ్రహ్మము గారి కాలజ్ఞానము కొంతవరకు తెలియును. వేమనయోగి ఆ కాలములోనే తన పద్యములలో అగ్రకులమువారు చేయు తప్పులను ఎండబెట్టడము జరిగినది. వీరబ్రహ్మముగారి చరిత్రలో కూడా బ్రహ్మము గారికి అగ్రకులము వారు చేసిన ఆటంకములను వ్రాయడము జరిగినది.

వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములో **"ప్రబోధాశ్రమము ఉన్నతమైన జ్ఞానము కలది"** అని మూడువందల యాభై సంవత్సరములప్పుడే వ్రాసియుంచాడు. కాలజ్ఞానములో 'ప్రబోధాశ్రమము' యొక్క పేరుండడము ఈ మధ్యన ఐదు సంవత్సరముల క్రితము మాకు తెలిసినది. తర్వాత బ్రహ్మము

గారు వ్రాసిన కాలజ్ఞానములో ప్రబోధాశ్రమమునకు, ప్రబోధానంద యోగీశ్వరులకు సంబంధించిన చాలా విషయములు వ్రాసినట్లు తెలిసినది. ఎంతో గొప్ప జ్ఞాని, కాలజ్ఞాని అయిన పోతులూరి వీరబ్రహ్మముగారు ప్రబోధాశ్రమాధిపతియైన ప్రబోధానందయోగీశ్వరుల వారిని గొప్పగా చెప్పుచూ **"ప్రబోధాశ్రమము వారు శయనాధిపతి గుణములు కల్గియున్నారు. శయనాధిపతియే ఆనందగురువు. ఆనంద గురువే నాకు గురువు, మీకు గురువు"** అని వ్రాయడము జరిగినది. ప్రబోధానందయోగీశ్వరుల జ్ఞానమేమిటో, ఎంత శక్తివంతమైనదో జ్ఞాన జిజ్ఞాసులకు కూడా తెలియుచున్నది. ఎందరో జ్ఞానులయిన వారు యోగీశ్వరులు చెప్పుచున్న జ్ఞానము ఎంతో గొప్పదని ప్రశంసించుచున్నారు. బ్రహ్మముగారే స్వయముగా తన గురువుగా చెప్పుకొన్న వ్యక్తి ఎంతటి వాడయివుంటాడో మనము కూడా ఆలోచించ వలసియున్నది. అయినా ప్రబోధానందయోగీశ్వరుల వారు ఒక్క దైవ జ్ఞానములో తప్ప మిగతా అన్నిటిలో సాధారణ వ్యక్తిగానే కనిపిస్తాడు. ఎదురుగా చూస్తే ఇతనికి జ్ఞానము తెలియునా! అన్నట్లు కనిపించినా, అవును ఆయన ఎవరికీ తెలియని గొప్పవాడే అన్నట్లు ఆయన వ్రాసిన గ్రంథములే గొప్ప శక్తులుగా నిరూపించుకొన్నాయి. ఒక గ్రంథము దగ్గరకు వస్తూనే కొందరిలో మార్పు కనిపించడమూ, కొందరు గ్రంథమును చదివిన వెంటనే అంతవరకు నయముగాని రోగములు పోవడము జరుగుచున్నది.

పైకి కనిపించని శక్తి యోగీశ్వరులలో నిక్షిప్తమైయుండుట బయటికి కనిపించకపోయినా ఆయన చెంతకు పోయినవారికి దేహములో నయము కాని, మందులులేని ఎయిడ్స్, క్యాన్సర్, డెంగీజ్వరములు సహితము శాంతించి పోవడము జరుగుచుండుట వలన యోగీశ్వరులు ఎంతటివారో ఎవరికయినా సులభముగా అర్థమయిపోగలదు.

వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములో **"ఆనంద యోగిని దూషించిన వారు చాలా ఇబ్బందుల పాలవుతారని"** వ్రాయడము జరిగినది. అలాగే

ఆయనను గానీ, ఆయన గ్రంథములనుగానీ దూషించినవారు ఇంతవరకు ఎవరూ సురక్షితముగాలేరు. తెలియని రోగములతో, అర్థముకాని బాధలతో కొందరుండగా, కొందరు చిత్రహింసలపాలై చనిపోవడము జరిగినది. అలా ఎందుకు జరుగుచున్నదో తెలియనివారు, పాపమును మూటగట్టుకొనుటకు యోగీశ్వరుల వారి జ్ఞానమునకు అక్కడక్కడ ఆటంకము లను కలుగజేయు చున్నారు. హిందూమతములో ఆదిశంకరాచార్యులు అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించాడు. తర్వాత కొంతకాలమునకు విశిష్టాద్వైత సిద్ధాంతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు. మరికొంత కాలమునకు ద్వైత సిద్ధాంతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. వీరు ముగ్గురూ అగ్రకులము వారు కావడము విశేషము. గత ముప్ఫైఆరు సంవత్సరముల నుండి **త్రైత సిద్ధాంతమును ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల వారు ప్రకటించి, ఆ సిద్ధాంతమునే ప్రచారము చేయుచూ త్రైత సిద్ధాంతము ప్రకారము భగవద్గీతను వివరించి వ్రాయడము జరిగినది.** హిందూమతములోని సిద్ధాంతముల వివరము తెలియని ప్రజలకు, అగ్రకులమువారు త్రైతము అంటే క్రైస్తవులకు సంబంధించినదనీ, త్రైత సిద్ధాంత భగవద్గీతయని పైకి చెప్పుచూ లోలోపల క్రైస్తవ మతమును బోధించుచున్నారని యోగీశ్వరులకు, యోగీశ్వరుల జ్ఞానమునకు వ్యతిరేఖముగా చెప్పడము జరిగినది. హిందుత్వమును ఒక వైపు సర్వ నాశనము చేయుచున్న అగ్రకులములవారు హిందూమతమును కాపాడువారివలె నటించుచూ యోగీశ్వరుల జ్ఞానమునకు కొన్నిచోట్ల ఆటంకము కల్గించడము జరిగినది. మూడుచోట్ల అన్యమతప్రచారమని భగవద్గీతను ప్రచారము చేయు యోగీశ్వరుల శిష్యుల మీద కేసులు పెట్టడము కూడా జరిగినది. కొన్నిచోట్ల ప్రత్యక్ష దాడులకు దిగడము జరిగినది. అయినా ప్రబోధానంద శిష్యులు అన్నిటికీ ఓర్పు వహించి, జ్ఞానప్రచారము చేయు చున్నారు. ఈ మధ్యకాలములో నల్గొండ జిల్లా భువనగిరిలో దేవేంద్ర అను మా సంఘ సభ్యునిమీద అన్యమత ప్రచారము చేయుచున్నాడని ఆరోపించి

కేసు పెట్టడము జరిగినది. అంతేకాకుండా మా ప్రచార వాహనము భువనగిరిలోనికి పోయినప్పుడు మా ఊరిలో ప్రచారము చేయవద్దని అడ్డుపడి పంపించడము జరిగినది. కరీంనగర్‌లో గోడమీద "త్రైత సిద్ధాంత భగవద్గీతను చదవండి" అని వ్రాస్తే, అగ్రకులము వారువచ్చి ఇది క్రైస్తవ మతప్రచారము దానిని తుడిపివేయమని చెప్పడము జరిగినది. రెండు రోజుల క్రిందట ఆర్లగడ్డలో ప్రచార వాహనముండగా అక్కడికి ఒక అగ్ర కులస్థుడు వచ్చి ఇది క్రైస్తవ ప్రచారము, ఈ ప్రచారమును నిలిపివేయండని ఘర్షణపడగా, ఆ సమయానికి మా గ్రంథములు చదివిన వారు అక్కడుండుట వలన వారే అగ్రకులమువారికి బుద్ధి చెప్పి పంపడము జరిగినది. అక్కడున్న ప్రజలు అనిన మాటలు "ఇది ఎంతో గొప్ప జ్ఞానము. ఇంతకాలానికి గొప్ప జ్ఞానము దొరికిందని మేము సంతోషపడుచుంటే, సమాజాన్ని సర్వనాశనము చేసిన మీరు దీనిని జ్ఞానము కాదంటారా? ఇట్లే మాట్లాడితే ఊరిలో లేకుండా మిమ్ములను మేమే పంపుతాము" అని అనడము జరిగినది. ఈ విధముగా ప్రజలే తిరగబడి బుద్ధి చెప్పు సమయము అన్నిచోట్లా వస్తుంది.

గౌతమబుద్ధుడు జ్ఞానము చెప్పితే అతను అగ్రకులము వాడు కాదని, ఆయనది వేరు మతమని ప్రచారము చేశారు. ఆ దినము గౌతముడు హిందువే కదా! తమ ఆధిపత్యము కొరకు హిందూమతమునుండి బుద్ధున్ని చీల్చి అతనిది బౌద్ధమతమని చెప్పి హిందూమతమునుండి వేరు చేశారు. ఈ దినము బౌద్ధమతము విదేశాలలో వ్యాపించియున్నా స్వదేశములో లేకుండా చేసినది అగ్రకులము వారు కాదా! ఈ దినము బుద్ధుడు మావాడే బౌద్ధము హిందూమతమే అని చెప్పుకోలేని పరిస్థితి మనకు ఏర్పడినది. అలాగే ప్రబోధానంద యోగీశ్వరులు చెప్పు త్రైత సిద్ధాంతమును హిందూ మతములోని భాగము కాదనడమూ, త్రైత సిద్ధాంత భగవద్గీతను భగవద్గీతే కాదనడమును ఒకవైపు ప్రజలు గమనిస్తున్నారు. ప్రబోధానంద యోగీశ్వరులు గత 40 సంవత్సరములుగా బోధించుచున్న బోధ హిందుత్వములోనే ఎంతో గొప్పదని

అన్ని మతములవారు ఒప్పుకొనుచుండగా, తగ్గుకులము వారని అగ్రకులముచే అనబడినవారందరూ హిందూ (ఇందూ) జ్ఞానమును తెలుసుకొని చైతన్యవంతులై అగ్రకులము వారికి తిరగబడి జ్ఞానము చెప్పు స్థితికి ఎదిగారు. తగ్గుకులము వారిమీద ఆధారపడి బ్రతుకుచున్న అగ్రకులమువారిని తగ్గుకులము వారందరూ ఒక్కమారు వెలివేస్తే, మీతో మాకు సంబంధము వద్దు అంటే ఏమవుతుందో చెప్పనవసరము లేదు. అటువంటి స్థితి రాకుండుటకు మా జ్ఞానమునకు అడ్డురావద్దని అగ్రకులము వారికి మరీమరీ చెప్పుచున్నాము.

ఇట్లు

## ప్రబోధ సేవాసమితి



# MATHAMU-PATHAMU



Author :

The Only GURU of Three Religions

The Spiritual Emperor, Thraitha Theorem Originator

Sri Acharya Prabodhananda Yogeeshwarulu

www.thraithashakam.org